# మందార మకరందాలు

సంకలనం

పీసపాటి కోటేశ్వరరావు



ప్రచురణ

సాహితీ మిత్రులు

కైకలూరు

# మందార మకరందాలు

(కమనీయ శ్లోకాలు - రమణీయ భావాలు)

సంకలనం :

**పీసపాటి కోటేశ్వరరావు**




స్థాపితం : 1996

ప్రచురణ

**సాహితీ మిత్రులు**

కైకలూరు

**మందార మకరందాలు**
(కమనీయ శ్లోకాలు - రమణీయ భావాలు)

సంకలనం : పీసపాటి కోటేశ్వరరావు
ప్రచురణ : సాహితీ మిత్రులు, కైకలూరు
ప్రథమ ముద్రణ : శ్రీ వికృతి ఉగాది (ది.16-03-2010)
మూల్యం : అమూల్యం
ప్రతులు : 500
ప్రచురణ సంఖ్య : పదిహేడు
ప్రతులకు : పీసపాటి కోటేశ్వరరావు
స్కూల్ అసిస్టెంట్ (తెలుగు)
శ్రీ నిమ్మగడ్డ నాగభూషణం ప్రభుత్వ ఉన్నత పాఠశాల
కైకలూరు, కృష్ణాజిల్లా.
సెల్ : 9966691811

: చింతపల్లి వెంకటనారాయణ
ప్రధాన కార్యదర్శి : సాహితీ మిత్రులు
కైకలూరు, కృష్ణాజిల్లా.
సెల్ : 9441091692

ముద్రణ : అన్నపూర్ణ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, కైకలూరు. ఫోన్ : 224601

# కృతజ్ఞతాభినందనలు



అమూల్యమైన ఈ "మందార మకరందాలు" ప్రథమ ముద్రణ విషయంగా కైకలూరు సాహితీ మిత్రులకు చేయూతగా ఆర్థిక సహకారం అందించి, ప్రోత్సహించిన సహృదయులు

**శ్రీ లావేటి వీరశివాజి**

అధ్యక్షులు : భారతీయ జనతా పార్టీ యువమోర్చా, కృష్ణాజిల్లా &
కన్వీనర్ : శ్రీ రామకృష్ణ సేవా సమితి, కైకలూరు వారికి

సర్వదా కృతజ్ఞులం

| | |
|---|---|
| తుమ్మలపల్లి బాలకృష్ణారావు | చింతపల్లి వెంకట నారాయణ |
| అధ్యక్షులు | ప్రధాన కార్యదర్శి |
| సాహితీ మిత్రులు, కైకలూరు | సాహితీ మిత్రులు, కైకలూరు |

# ముందు మాట

మాతృభాషోపాధ్యాయునిగా పనిచేస్తూ, బాలబాలికలకు సంస్కృతంలోని మాధుర్యాన్ని చవిచూపించే ప్రయత్నంలో భాగంగా ముక్తకాలపై ప్రత్యేక దృష్టి సారించాను. మహాకవులు, రచయితలు, పండితులు సందర్భోచితంగా చెప్పిన శ్లోకాలను సేకరించి, సంకలనం చేయాలనే సంకల్పం జరిగింది. తదాది వివిధ సభలకు హాజరుకావడం, జ్ఞాన, వయో, విద్యావృద్ధులు తమ అనుభవ సారాన్ని రంగరించి నుడివిన ఆణిముత్యాలను గ్రంథస్థం చేసుకోవడం జరిగింది. అయితే వాటిని విపులీకరించి, భావజాలాన్ని విస్తరణ చేసి సంస్కృత రసజ్ఞులకు, అభిమానులకు, భాషాపిపాసులకు అందించే ప్రయత్నానికి ఒక సాకారమే యీ 'మందార మకరందాలు' సంకలనం.

వివిధ పర్వదినాలలో మిత్రులకు, బంధువులకు; స్కూల్ కాంప్లెక్స్ సమావేశాలలో ఉపాధ్యాయ మిత్రులకు వీటిని వండి, వడ్డించే ప్రక్రియ ఫలవంతం అవడం నాలో ఉత్సాహ ప్రోత్సాహాలను రెట్టింపు చేసిందనడంలో అతిశయోక్తి కానేరదు. తెలుగు భాషా రిసోర్స్ పర్సన్‌గా విధ్యుక్త ధర్మ నిర్వహణలో నాకీ 'మందార మకరందాలు' ఎంతగానో ఉపకరించాయి. "అమృతం బాలభాషితమ్' అన్నట్లుగా ఇవి బాలల నోళ్ళల్లో నాటుకొన్నాయి. బాలబాలికల వాచికచర్య మెరుగుదలకివి ఎంతో దోహదం చేశాయి. ఎన్నికల విధి నిర్వహణలో నాటి కాలంలో లారీలలో పయనించే సందర్భాలలో కూడా ఈ శ్లోకాలు చీమటపాకాయల్లా పేలి, పలువురి మానసిక వికాసానికి, ఉల్లాసానికి కారకాలయ్యాయి. ప్రాంతీయ విద్యా సదస్సులలోను విరామసమయాల్లో ఈ నిత్య సత్యాలు తమ ప్రత్యేకతను సంతరించుకున్నాయి.

అంతటి ప్రాభవము, ప్రాచుర్యము పొందిన యీ "మందార మకరందాలను" ముద్రణ వేయించాలని పలువురు తమ ప్రగాఢ వాంఛను వెలిబుచ్చారు. కాని ఆ చిరకాల వాంఛ యీనాటికి నెరవేరింది.

ఈ సంకలనం ప్రచురణకు తమ ఆమోదాన్ని తెలిపిన సాహితీ మిత్రులు, కైకలూరు వ్యవస్థాపకులు శ్రీ చింతపల్లి వెంకటనారాయణ గారికి నా అమందానంద కందళిత హృదయారవింద సమర్పిత నమస్సుమాంజలులు. ఈ సంకలనంలో నాకు ప్రోత్సాహాన్నందించిన 'సాహితీ మండలి-ఉయ్యూరు' వారికి నా ధన్యవాదములు.

భారతీయ ప్రాచీన ఆర్ష సాంప్రదాయానికి అద్దంపట్టే యీ "మందార మకరందాలు" అన్ని వయసుల వారిని కుల, మత, భాషాభేదం లేకుండా అలరింపజేస్తాయని నా ప్రగాఢ విశ్వాసము. ఇందులోని చక్కని, చిక్కని భావాలు మనస్సును గిలిగింతలు పెట్టేలా ఉంటాయని, పఠనంలో కాలాన్ని యిట్టే హరణము చేయగల నవ్యత, భవ్యత యీ మకరందాలు పుణికిపుచ్చుకున్నాయని నా అభిప్రాయము.

ఈ సంకలనంలో తమ అమూల్య సలహాలను, సూచనలను ఇచ్చిన మా గురువరేణ్యులు శ్రీమాన్ చింతా బాలకృష్ణశర్మ గారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతాభివందనములు

నా పురోభివృద్ధిలో తోడ్పడే మా తండ్రి శ్రీ పీసపాటి వెంకట్రావుగారికి, వెన్నంటి నడిపించే మార్గదర్శకులు శ్రీ కొప్పరపు బాలామనోహరరావు గారికి నా నమస్సులు.

కైకలూరు  
16-03-2010

బుధజన విధేయుడు,  
**పీసపాటి కోటేశ్వరరావు**

శుక్లాంబరధరం । విష్ణుం ।
శశివర్ణం । చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం । ధ్యాయేత్ ।
సర్వ విఘ్నోపశాంతయే ॥ 1

భా॥ తెల్లని వస్త్రములను ధరించినవాడును, సర్వమును (సర్వత్ర) వ్యాపించి యున్నవాడును, చంద్రునివలె ధవళమైన వర్ణము కలవాడును, నాలుగు భుజములు కలవాడును, నిర్మలమైన ముఖము (ఏనుగు ముఖము) కలిగిన వాడునునైన వినాయకుని సర్వవిఘ్నములు తొలగుటకుగాను ధ్యానించుచున్నాను.

అమృతం సద్గుణాభార్యా ।
అమృతం బాలభాషితమ్ ।
అమృతం రాజసమ్మానమ్ ।
అమృతం మానభోజనమ్ ॥ 2

భా॥ గుణవంతురాలైన భార్య, చిన్న పిల్లల ముద్దులొలుకు పలుకులు, రాజసభలలో ప్రభుత్వముచేత సన్మానము పొందుట, ప్రేమతో పెట్టు భోజనము "అమృతము"తో సమానము.

అచార్యాత్ పాదమాదత్తే ।
పాదం శిష్యస్స్వమేధయా ।
పాదం సహచరైస్సాకమ్ ।
పాదం కాలక్రమేణచ ॥ 3

భా॥ గురువుగారి వలన పావువంతు మాత్రమే గ్రహించును. మరో పావు వంతు శిష్యుడు తన మేధస్సును మథించి తెలిసికొనవలయును. ఒక పావువంతు తోటి విద్యార్థులద్వారా, మరో పావువంతు కాలక్రమేణ తన అనుభవాలను జోడించి శోధించి, సాధించి పరిపూర్ణ జ్ఞానము పొందును.

విశ్వామిత్రాహి పశుషు
కర్దమే విషమస్థలే
అంధే తమసి వార్ధక్యే
దండం దశగుణం భవేత్ 4

భా॥ పక్షులు, కుక్కలు, శత్రువులు, పాములు, పశువులు, బురద, ఎగుడు దిగుడునేల, గ్రుడ్డితనము, చీకటి, ముసలితనము ఈ పది విషయములలోను దండము (కఱ్ఱ) ఆలంబనముగాను, కొండంత అండగానుఉండి, పదింతలు ధైర్యాన్ని కూడగట్టి నిలదొక్కుకునేలా చేస్తుంది.

తులేన కించిత్, తులయాచ కించిత్
మానేన కించిత్, శపథేన కించిత్,
కించిచ్చ కించిచ్చ హరత్సశేషమ్
వణిక్సమో నాస్తి ప్రశస్త చోరః 5

భా॥ త్రాసులో కొంత, తూచడంలో కొంత, కొలవడంలో కొంత, ఒట్టుపెట్టి అమ్మడంలో కొంత, యిలా కొద్దిగా కొద్దిగా, చివరకు నిశ్శేషంగా మనల సొమ్మును పూర్తిగా గుంజుకొనే వ్యాపారి కంటె మహాగజదొంగ యీ లోకంలో లేడు.

గురవో బహవస్సన్తి
శిష్య విత్తాపహారిణః
దుర్లభోయం గురుర్దేవి !
శిష్య చిత్తాపహారకః ॥ 6

భా॥ ఓతల్లీ! ఈ లోకంలో శిష్యుల (విత్తాన్ని) ధనాన్ని దోచుకొనే గురువులు కోకొల్లలు. కాని శిష్యుల (చిత్తాన్ని) మనస్సులను దోచుకొనే గురువే కరువైపోయాడు. శిష్యుల చిత్తాన్ని దోచుకొనే గజదొంగయే నిజమైన గురువు.

లాలయేత్ పంచ వర్షాణి !
దశవర్షాణి తాడయేత్ !
ప్రాప్తేతు షోడశేవర్షే !
పుత్రం మిత్రవదాచరేత్ ॥ 7

భా॥ పుత్రుణ్ణి ఐదు సంవత్సరముల ప్రాయము వరకు లాలించి, బుజ్జగించాలి. తరువాత పది సంవత్సరాలు దండించైనా సరే మంచి శిక్షణనీయవలెను. 16వ సం. వచ్చీరాగానే పుత్రుణ్ణి కూడ ప్రియమైన మిత్రుడిలాగా ఆదరించి గౌరవించాలి.

మాతాసమం నాస్తి శరీర పోషణమ్ ।
భార్యాసమం నాస్తి శరీర తోషణమ్ ।
చింతా సమం నాస్తి శరీర శోషణమ్।
విద్యాసమయం నాస్తి శరీర భూషణమ్ । 8

భా॥ శరీరాన్ని ఆరోగ్యవంతంగా పుష్టిగా, తుష్టిగా పెంచి పోషించడంలో తల్లితో సమానమైనది లేదు. శరీరాన్ని సుఖపెట్టడంలో భార్యతో సమానమైనది లేదు. శరీరాన్ని కృశింపచేసి, నశింపజేయడంలో ఏనుగులాగా ఉన్నవాడిని పీనుగులాగా మార్చడంలో దిగులుతో సమానమైనది లేదు. ఎలాంటి కురూపి శరీరానికైనా అందాన్నిచ్చి సుందరంగా తీర్చిదిద్ది ఔరా! అని మురిపించి మరిపింప జేయగలిగేది విద్యయే.

మనస్యేకం వచస్యేకం
కర్మణ్యేకం మహాత్మనామ్
మనస్యన్యత్ వచస్యన్యత్
కర్మణ్యన్యత్ దురాత్మనామ్ ॥ 9

భా॥ మహాత్ములకు మనసు, మాట, చేత ఒకటిగా ఉంటాయి. అనగా త్రికరణములు శుద్ధిగా ఉంటాయి. దురాత్ములకు మనసు ఒక విధంగా ఉంటుంది. మాట మరోవిధంగా ఉంటుంది. చేత వేరే విధంగా ఉంటుంది. త్రికరణశుద్ధి ఉండదు.

పరోపకారాయ ఫలన్తివృక్షాః
పరోపకారాయ దుహన్తి గావః
పరోపకారాయ వహన్తి నద్యః
పరోపకారార్థ మిదం శరీరమ్ ॥ 10

భా॥ చెట్లు ఇతరుల మేలుకోసం ప్రకృతి వైపరీత్యాల నెదురొడ్డి కాయలను కాస్తున్నాయి. ఆవులు పుష్టికరమైన పాలనిచ్చి ప్రాణికోటిని కాపాడుతున్నాయి. నదులు సుదూరం ప్రవహించి బీడుభూములను సైతం సస్యశామలంచేసి, పంటలను పండింపజేస్తున్నాయి. దాహం తీర్చి ప్రాణాధారమౌతున్నాయి. కావున వివేక జ్ఞానం గల మన శరీరం పరోపకారం కోసమే వినియోగించవలసియున్నది.

అన్నం దానాత్ పరం దానం ।
విద్యాదాన మతః పరమ్ ।
అన్నేన క్షణికా తృప్తి :
యావజ్జీవంచ విద్యయా ॥ 11

భా॥ అన్ని దానములకంటె అన్నదానమే మిన్న. అన్నదానము కంటెను పరికింపగా విద్యాదానమే మిక్కిలి గొప్ప. ఎట్లనగా అన్నదానము వలన గలుగు తృప్తి తాత్కాలికము. పైగా క్షణికము. విద్యాదానము వలన కలుగు తృప్తి జీవితాంతము ఉంటుంది.

ఆయుర్విత్తం గృహచ్ఛిద్రం
మన్త్రౌషథ సమాగమాః
దాన మానావ మానాశ్చ
నవ గోప్యా మనీషిభిః ॥ 12

భా॥ ఆయుష్షు, డబ్బు, ఇంటిగుట్టు, (తేలు, పాముపంటి) మంత్రములు, చిట్కావైద్యము (మందు), కలయిక, దానము, సన్మానము, అవమానము - అనెడి యీ తొమ్మిదింటిని ప్రతి మనిషి రహస్యంగా దాచిపెట్టుకోవాలి. ఎవరికి పడితే వారికి యివి చెప్పి, కష్టాలు కొనితెచ్చుకోవడం మంచిది కాదని హితవు.

కార్యేషుదాసీ కరణేషు మంత్రీ
రూపేచ లక్ష్మీః క్షమయా ధరిత్రీ
భోజ్యేషు మాతా శయనేతు రంభా
షట్కర్మయుక్తా కులధర్మపత్నీ 13

భా॥ పనిపాటలయందు దాసివలెను, అన్నిజటిల సమస్యలయందును భర్తకు చక్కని ఆలోచన యివ్వగలిగిన మంత్రిగను, అంద చందములలో మహాలక్ష్మివలెను, ఓర్పు వహించుటలో అనగా పిల్లల పోషణ, బంధువులనాదరించుటలో భూదేవివలెను; పెట్టుపోతలలో తల్లివలెను. భర్త మనసును కరిగించుటలో అప్సరస వలెను వర్తిల్లుట అను నీ ఆరును కులస్త్రీ లక్షణములు.

కన్యా వరయతే రూపం ।
మాతా విత్తం । పితా ఘనమ్ ।
బాంధవాః కులమిచ్ఛన్తి ।
మృష్టాన్న మితరే జనాః ॥ 14

భా॥ **పెళ్ళి - ఆప్తుల అంతరంగాలు**

కన్య వరుని అందచందాలనే కోరుకుంటుంది. మిగతా వాటినంతగా పట్టించుకోదు. తల్లి వరుని స్థిర, చరాస్థులను అంచనా వేస్తుంది. తండ్రి వరునికి సమాజములో గల పరువు, ప్రతిష్ఠ, యశములను గణనలోనికి తీసికొంటాడు. బంధువర్గము సవర్ణ వివాహమా! కులాంతర వివాహమా! అనే మీమాంస చేసి తృప్తిపడుతుంది. వీరుకాక మిగతావారంతా పసందైన విందు భోజనము పట్ల మిక్కిలి మక్కువ కనబరుస్తారు.

ఏకస్స్వాదు న భుంజీత
నైకః సుప్తేషు జాగృయాత్ ।
ఏకో న గచ్ఛేత్ అధ్వానమ్ ।
నైక శ్చార్థాన్ ప్రచింతయేత్ ॥ 15

భా॥ మధురాతిమధురమైన పదార్థమును ఒక్కడే భుజింపరాదు. కనీసం ప్రక్కవాడికి ఒక్కడికైనా పెట్టి తింటేనే దానిలోని అసలు సిసలు మాధుర్యం తెలుస్తుంది. అందరూ నిద్రిస్తుండగా ఒక్కడే మేల్కొని యుండరాదు. ఎలాంటి అపవాదుకైనా గురికావచ్చును. కొత్తదారిలో ఒక్కడే వెళ్ళకూడదు. తప్పక తోడుండాలి. ఏదైనా జటిల సమస్య కొరక రాని కొయ్యలాగా అనిపించినప్పుడు ఒక్కడే బుఱ్ఱపగిలేలా ఆలోచించరాదు. ఎవ్వరితోనైనా సంప్రదించాలి. సమస్య సులువుగా పరిష్కారమౌతుంది.

అసారే ఖలు సంసారే
సారం శ్వశుర మందిరమ్ ।
హిమాలయే హరశ్శేతే ।
హరిశ్శేతే మహూదధౌ ॥ 16

భా॥ సారమే మాత్రము లేని యీ సంసారంలో (Some) "సం సారం" కొద్దిగా సారం కలిగినది అత్తవారిల్లే. అందుకనే హరుడు (శివుడు) తన మామగారైన హిమవంతుని నెత్తిపై అనగా కైలాసంలో కాపుర మున్నాడు. ఇంక సాక్షాత్ శ్రీహరి తన మామగారైన పాల సముద్రంలో స్థిరనివాసం ఏర్పరచుకొని ఇల్లరికం ఉండిపోయాడు. "ఇల్లరికంలో ఉన్న మజా!" అంటే యిదేనేమో!

నభసో భూషణం చన్ద్రః ।
నారీణాం భూషణం పతిః
పృథివ్యాః భూషణం రాజా ।
విద్యా సర్వస్య భూషణమ్ 17

భా॥ రాత్రికి చంద్రుడు అలంకారము. స్త్రీలకు భర్త అలంకారము. పుడమికి రాజు అలంకారము. విద్య అందరికీ అలంకారమే. పై మూడింటిలోని అలంకారము ఒక్కొక్క దానికి మాత్రమే పరిమితము. కాని విద్య సర్వదా, సర్వత్రా, సర్వులకు అలంకారమే.

గాంధర్వంచ । కవిత్వంచ ।
శూరత్వం । దానశీలతా ।
అభ్యాసేన నలభ్యంతే ।
చత్వార స్సహజా గుణాః 18

భా॥ సంగీతము, కవిత్వము, వీరత్వము, దాన గుణము ఈ నాలుగు ఒకరిని చూచి నేర్చుకొంటే అలవడేవి కావు. పుట్టుకతోనే వస్తాయి. పుట్టుకతో ఆ గుణాలుంటే అభ్యాసము వల్ల దానిని యినుమడింప జేసుకోవచ్చు.

ఉత్తమం స్వార్జితం విత్తమ్ ।
మధ్యమం పితురార్జితమ్ ।
అథమం భ్రాతృవిత్తంచ ।
స్త్రీ విత్త మథమాథమమ్ ॥ 19

భా॥ తాను కష్టపడి సంపాదించుకొన్న డబ్బుతో జీవనం గడపడం శ్రేష్ఠము. శ్రేయోదాయకము, గౌరవప్రదము. కేవలం తండ్రి గడించి యిచ్చిన ధనాన్ని జీవనం కోసం వాడుకోవడం మధ్యమము. అంత గౌరవప్రదం కాదు. సోదరుని సంపాదనపై ఆధారపడి ఆడబ్బుతో కులకడం అథమమార్గము. ఏ మాత్రము శ్రేయస్కరము కాదు. ఇంక తాను పైసా గడించకుండా, కేవలం భార్య సంపాదనపై ఆధారపడి జీవించేవాడి బ్రతుకు శుద్ధదండుగ. "ఉద్యోగం (కష్టపడి పనిచేయడం) పురుషలక్షణం" అని సారాంశము.

వేదమూల మిదం బ్రాహ్మ్యం ।
భార్యామూల మిదం గృహం ।
కృషిమూల మిదం ధాన్యం ।
ధనమూల మిదం జగత్ ॥ 20

భా॥ వేదములే శిష్టాచార, సదాచార సంపన్నులైన బ్రాహ్మణుల బ్రహ్మత్వమునకు మూలము. భార్యయే కుటుంబ పోషణ, అతిథి అభ్యాగతుల పోషణకు అలవాలమైన గృహమునకు మూలము. చెమటోడ్చి చేయుపని (కృషి)యే సమస్త జగదాధారమైన ధాన్య సంపత్తికి మూలము. డబ్బే లోకమందలి సమస్త వ్యవహారాలకు మూలము.

చితా చింతా ద్వయోర్మధ్యే
చింతా నామ గరీయసీ
చితా దాహతి నిర్జీవం
చింతా ప్రాణయుతం వపుః ॥ 21

భా॥ 'చిత' అనగా "చితి". "చింత" అనగా దిగులు. చిత–చింత ఈ రెంటికి మధ్య సున్నా మాత్రమే తేడా. చిత–చింత ఈ రెంటిలో 'చింత'యే మిక్కిలి బలీయమైనది. ఎందుకంటే 'చిత' చచ్చిన శవాన్ని మాత్రమే దహింపజేయగలుగుచున్నది. కాని 'చింత' ప్రాణముండగానే శరీరాన్ని క్రుంగదీసి, కృశింపజేసి దహింపజేస్తుంది. అందుకనే "చింతాసమం నాస్తి శరీర శోషణమ్" అని యిదివరకే చెప్పబడింది.

సూపం వినా భోజన మప్రశస్తమ్
యూపం వినా యాజన మప్రశస్తమ్
ధూపం వినా పూజనమప్రశస్తమ్
దీపం వినా మైధున మప్రశస్తమ్ 22

భా॥ పప్పులేని భోజనము, వధ్యశిల లేని యజ్ఞము, ధూపము (అగరుబత్తీ పొగ) లేని పూజాదికాలు, దీపము లేని దాంపత్యక్రీడ లోకమున అప్రశస్తాలుగా పెద్దలు వ్యవహరిస్తున్నారు.

**వధ్యశిల : యజ్ఞ యాగాదులలో జంతుబలికై ఏర్పాటు చేయబడిన కొయ్య**

పుస్తకం వనితా విత్తమ్ ।
పరహస్తం గతం గతం ।
అథవా పునరాయాతి ।
జీర్ణ భ్రష్టాచ ఖండశః ॥ 23

భా॥ "పుస్తకము, స్త్రీ, డబ్బు" ఈ మూడు చెయ్యి దాటిపోకూడదు. పోతే తిరిగి రానేరావు. ఒకవేళ తిరిగి వచ్చినా పుస్తకం చినిగిపోయి వస్తుంది. స్త్రీ అల్లరిపాలై, చిరిగిపోయిన విస్తరిలా చెడిపోయి వస్తుంది. డబ్బు పువ్వుల్లో పెట్టి కట్టలు కట్టలుగా ఇచ్చినా సరే అది ముక్కలు ముక్కలుగా వాయిదాల పద్ధతులలో, చిరకాలానికి వస్తుంది. అసలు రాకపోయినా ఆశ్చర్యపోనవసరం లేదు.

వేదవిదే కిల దత్తం దత్తం ।
బంధుజనైస్సహ భుక్తం భుక్తం ।
ప్రియతమయా సహ సుప్తం సుప్తం ।
అన్యమదత్త మభుక్త మసుప్తం ॥ 24

భా॥ వేదములు నేర్చిన పండితునికి ఇచ్చిన దానమే దానమౌతుంది. బంధుజనాలతో కలిసి తిన్న భోజనమే భోజనము. సహపంక్తి భోజనాలతో తృప్తి కల్గుతుంది. ప్రియతమునితో/ప్రియతమురాలితో పోయిన నిద్రయే సుఖనిద్ర. ఇవికాక యితరులకిచ్చినదేదైనా ఇవ్వనట్లే. ఏది తిన్నా (అభుక్తమే) తిననట్లే. ఏ విధంగా నిద్రపోయినా అసుప్తమే (నిద్రకానట్లే).

న చోరహార్యం । నచ రాజహార్యం
న భ్రాతృభాజ్యం । నచ భారకారీ
వ్యయేకృతే వర్ధత ఏవ నిత్యం
విద్యాధనం సర్వధన ప్రధానమ్ ॥ 25

భా॥ చదువు అనేది కూడా ఒక ధనమే. అయితే యిది దొంగలచే దొంగిలింపబడేది కాదు. సీలింగ్ పేరిట రాజుచే / ప్రభుత్వముచే బలవంతముగా ఆక్రమించబడేదికాదు. సోదరులచే పంచుకో బడేదికాదు. ప్రయాణ సమయంలో బరువుగా తోచేది కాదు. మిగతా డబ్బు ఖర్చుచేసే కొద్ది తరిగిపోతుంది. కాని యీ విద్యా ధనము పంచిపెట్టేకొద్ది చక్రవడ్డీతో సహా వృద్ధిపొందుతుందే గాని ఎన్నటికి తరగదు.

పరాధీనం వృథా జన్మ ।
పరస్త్రీషు వృథా సుఖమ్ ।
పరగేహే వృథా లక్ష్మీః ।
విద్యా యా పుస్తకే వృథా । 26

భా॥ ఇతరులపై ఆధారపడి గడిపే జీవనం స్వతంత్ర ప్రతిప్రత్తిలేనిద్దై, నిస్సారంగా, నిస్తేజంగా గడచిపోతూ వృథా అనిపిస్తుంది. అలాగే పరస్త్రీ సుఖము అన్యాయమై, అక్రమమై మనశ్శాంతినీయక ఏదో నేరం చేసిన వాడిలా కృంగి, కృశింపజేసి వృథా అనిపిస్తుంది. ఇతరుల ఇండ్లలోని సిరిసంపదలు మనకు ఆప్తులవే (అయినప్పటికి) అని ఎంత గొప్పలు చెప్పుకొన్నప్పటికిని, అవి మనకు అవసరానికి ఆసరా కావు. అలాగే పుస్తకంలోని విద్య మస్తకంలోనికి ఎక్కనపుడు అది ఎంత విలువైన దైనప్పటికిని, అనర్ఘ రత్నమైనప్పటికిని నిరుపయోగమే కదా!

విదుషాం ప్రమదాయ సోపసర్గా
గరుడాంకస్య ముదే గతోపసర్గా
అ'ప'కారవతీ ప్రియాయ శంభోః
"ఉపమా" కస్యముదే నచిత్రరూపా ॥ 27

భా॥ పండితులకు, కవులకు 'ఉప' అనే ఉపసర్గతో కూడిన 'ఉపమా' ఆనందం కలిగించుతుంది. 'ఉప' తీసివేయబడిన (ఉప)"మా" (లక్ష్మీదేవి) గరుడ వాహనారూఢుడైన విష్ణువునకు మహాయిష్టము. 'ప'కారము తీసివేయబడిన 'ఉ(ప)మా" శివునికి ప్రియాతి ప్రియము. అలాంటి ప్రశస్తమైన, రుచికరమైన ఉపమా (ఉప్మా) చిత్ర విచిత్ర రూపాలలో వడ్డిస్తుంటే ఎవరికి ఆనందం కలిగించకుండా ఉంటుంది?.

మధురాధర సంసర్గా । - శ్యామా । చారుపయోధరా ।
స్నిగ్ధా సర్వాంగసురభిః । - కాపి (ఫీ) కస్మై న రోచతే ॥ 28

భా॥ 1) తీయనైన పెదవితో ఉషోదయ కాలంలో స్నేహాన్ని కలగలిపేదియు, గోరోజన వర్ణం కలిగినటువంటిన్నీ, చక్కని చిక్కని పాలతో చెలిమి, కలిమి, బలిమి కలిగించేటువంటిన్నీ, అప్పుడే కాయడం చేత అణువణువు నుండి వెలువడే పొగలసెగలచేత రుచికి, శుచికి మనోహరమై యొప్పెడి కాఫీ ఎవరికి రుచించదు?

2) తీయనైన పెదవి, నిండు యౌవనము, చక్కని స్తనమండలము, అంగాంగ లావణ్యము గల జవరాలు ఎవరికి ప్రియము కలిగించదు? అందరినీ ఆకట్టుకోగలదని భావన.

టకా ధర్మః । టకా కర్మ । - టకా హి పరమం పదమ్ ।
టకా యస్య గృహే నాస్తి । - హాటకాః టక్ టకాయతే ॥ 29

భా॥ "టకా" అనగా డబ్బు. డబ్బే ధర్మాన్ని చేయిస్తోంది. ధర్మకార్యనిర్వహణకు డబ్బు ప్రధానము. కర్మ అనగా మనం జేసే పని. ఏ పని చేయాలన్నా డబ్బు కావాలి కదా! మంచి పనులను, చెడు పనులను కూడా డబ్బే చేయిస్తోంది. డబ్బే మోక్షపదాన్ని యిస్తోంది. అలాంటి డబ్బు ఎవరి యింట ఉండదో వారి యింట కుండలు టక టకలాడుతుంటాయి.

యౌవనం । ధన సంపత్తి : ।
ప్రభుత్వ మవివేకితా ।
ఏకైక మప్యనర్థాయ ।
ఏకత్ర కిము ఉచ్యతే ॥ 30

భా॥ ఉరకలువేసే యౌవనము, అవసరాలకు మించిన ఐశ్వర్యము, కను సన్నలచే చిటికెలో ఏపనియైన పురమాయించి సాధించితీరే అధికారము, కావలసినంత, అమేయమైన తెలివితక్కువ తనము ఈ నాలుగులో ఏ ఒక్కటి మనచెంత ఉన్నా కలిగే అనర్థాలు అన్నీ యిన్నీ కావు. ఇంక నాలుగు ఒకే వ్యక్తిలో ఉంటే వేరే చెప్పాల్సింది ఏమీ లేదు.

కావా బాలా ? కాంచన మాలా !
కస్యాః పుత్రీ ? కనకలతాయాః ।
కిం వా హస్తే ? తాళజ పత్రమ్ ।
కిం వా లిఖితమ్ ? క, ఖ, గ, ఘ ॥ 31

భా॥ భోజమహారాజు గారొకనాడు విహారానికి వెళ్ళగా ఒక అమ్మాయి బడికి పోతోంది. వారిద్దరి మధ్యే సంభాషణ యిలా సాగింది.

| | | |
|---|---|---|
| భోజ. | : | అమ్మాయీ! నీవెవరు ! |
| పాప | : | కాంచనమాల. |
| భోజ. | : | నీవెవరి అమ్మాయివి? |
| పాప | : | కనకలత కూతుర్ని |
| భోజ. | : | నీ చేతిలోనిది ఏంటమ్మా? |
| పాప | : | తాటాకు |
| భోజ. | : | దానిలో ఏమి రాశావు? |
| పాప | : | క ఖ గ ఘ |

భోజరాజు కాలంలో సంస్కృత మాధ్యమానికి అంతటిప్రాచుర్యం ఉంది.

ఋణకర్తా పితా శత్రుః । - మాతా చ వ్యభిచారిణీ ।
భార్యా రూపవతీ శత్రుః । - పుత్ర శ్శత్రు రపండితః 32

భా॥ తీర్చలేని అప్పులు చేసిన తండ్రి ఆ కుటుంబానికి బద్ధ శత్రువు. తల్లి నీతి నియమములు వీడి వ్యభిచరించినచో ఆ తల్లి ఆ వంశానికే పరమ శత్రువు. జగదేక సుందరియైన భార్య ఎంత పతివ్రతగా ఉన్నప్పటికిని అనుమానమనే కారణముచే భర్తకు శత్రువు లాగా అనిపిస్తుంది. పుత్రుడు ఎంత అందగాడైనా చదువు సంధ్యలు లేకపోతే పరమశుంఠయై తల్లికి తండ్రికి శత్రువు అవుతాడు.

అనభ్యాసే విషం విద్యా - త్వజీర్ణే భోజనం విషమ్ ।
విషం సభా దరిద్రస్య । - వృద్ధస్య తరుణీ విషమ్ ॥ 33

భా॥ అభ్యాసము లేని విద్య. అనగా అడపాదడపా చదివే చదువు కాలక్షేపానికి సరిపోతుంది కాని క్షుణ్ణంగా వంటపట్టదు. కాలక్షేపంగా చదివేవాడికి చదువు విషం. సుష్టుగా భోంచేసి తిన్నది అరగని వాడికి పెట్టే భోజనం విషతుల్యం. కడుపు కాలేవాడికి చెప్పే ఉపన్యాసం, గోష్ఠి విషమే. అలాగే ముసలివానికి పడుచుపెళ్ళాం కూడా విషమే.

బాల సఖిత్వ మకారణహాస్యం ।
స్త్రీషు వివాద మసజ్జన సేవా ।
గార్దభ యాన మసంస్కృతవాణీ ।
షట్సు నరో లఘుతాముపయాతి 34

భా॥ బాలలతో స్నేహము చేయడం, కారణము లేకుండా నవ్వడం, చీటికీ, మాటికీ స్త్రీలతో తగాదాపడటం, సజ్జనులు కారని తెలిసినా మన పనులు చెక్కబెట్టుకోవడానికై వారి సేవ చేయవలసిరావడం, గాడిదపై ఎక్కి ఊరేగడం, సభ్యత-సంస్కారమూ, మంచి-చెడూ, సమయము, సందర్భమూ, యుక్తము - అయుక్తము లేకుండా నోటికి వచ్చినట్లు మాట్లాడటం అనే యీ ఆరున్ను ఎంతటి గొప్ప వాణ్ణయినా దూదిపింజకంటె తేలికపరుస్తాయి.

అలసస్య కుతో విద్యా ?
అవిద్యస్య కుతో ధనమ్ ?
అధనస్య కుతో మిత్రమ్ ?
అమిత్రస్య కుత స్సుఖమ్ ॥ 35

భా॥ సోమరిపోతుకు చదువెలా అబ్బుతుంది? అసలు అలాంటి అలసునికి చదువెక్కడిది? చదువులేనివానికి డబ్బెక్కడిది? డబ్బులేని వానికి మిత్రులెలా ఏర్పడతారు? మిత్రులే లేనివాడికి యీ లోకంలో సుఖం ఎలా కలుగుతుంది? సుఖం కావాలంటే మిత్రులు, మిత్రులు కావాలంటే డబ్బు, డబ్బు కావాలంటే చదువు, చదువు కావాలంటే చురుకుతనము కావాలి. అలసత్వము అన్ని అనర్థాలకు మూలము.

సుజీర్ణ మన్నం । సువిచక్షణ స్సుతః ।
సుశాసితా స్త్రీ । నృపతి స్సుసేవితః ।
సుచింత్య చోక్తం । సువిచార్య యత్కృతం
సుదీర్ఘ కాలేపి న యాతి విక్రియాం ॥ 36

భా॥ బాగుగా అరిగిన అన్నము; మంచి, చెడూ తెలిసిన వివేకియైన పుత్రుడు, సుశిక్షితురాలయిన అమ్మాయి, మంచి సేవకుల సేవలందే రాజుగారు, బాగుగా ఆలోచించి మాట్లాడిన మాట, ఒకటికి పదిమారు పలికించి, పెద్దలసలహాపై నిలకడగా చేసిన పని - యీ ఆరున్నూ ఎంతకాలం గడిచినప్పటికి దుష్ప్రభావము, దుష్ఫలితములనీయక స్థిరంగా, శ్రేయోదాయకంగా ఉంటాయి.

బాలార్కో ప్రేతధూమశ్చ
వృద్ధాస్త్రీ పల్వలోదకమ్
రాత్రౌ దధ్యన్న భుక్తిశ్చ
అయుఃక్షీణం దినే దినే. 37

భా॥ ఉదయ కాలపు ఎండ, చితిపైనుండి విరజిమ్మే పొగ, తనకంటె పెద్దదైన స్త్రీతో సంసారబంధము, మురికిగుంటలో నీరు పానీయముగా వాడుట, రాత్రియందు పెరుగన్నము మిక్కుటముగా భుజించుట అను నీ యైదు ఆయుఃక్షీణానికి కారణాలు.

వృద్ధార్కో హోమధూమశ్చ
బాలాస్త్రీ నిర్ఝరోదకమ్
రాత్రౌ క్షీరాన్న భుక్తిశ్చ
ఆయుర్వృద్ధిః దినే దినే 38

భా॥ సాయంకాలపు టెండ, యజ్ఞయాగాదుల నుండి పీల్చే పొగ, తనకంటె చిన్నదైన తరుణితో వివాహబంధము, గలగలపారే సెలయేటి నీటి పానీయము, రాత్రియందు పాలుబోసిన యన్నము తినుట అను నీ యైదున్ను ఆయుః వృద్ధికి కారకాలు.

పక్షీణాం బలమాకాశం ।
మత్స్యానా ముదకం బలం ।
దుర్బలస్య బలం రాజా ।
బాలానాం రోదనం బలమ్ ॥ 39

భా॥ పక్షులకు ఏ పని సాధించుకోమన్నా మిక్కిలి బలాన్నిచ్చి ప్రోత్సహించేది ఆకాశము. అలాగే చేపలకు సమస్త కార్యసాధనము జలమే. బడుగుల అవసరాలలో ఆదుకొని వారికి వెన్నుదన్నుగా ఉండేది రాజు / ప్రభుత్వ పథకాలు. పిల్లలకు బలము ఏడుపు. ఆ ఏడుపుతో వారు ధర్నా, సమ్మె చేసి, వారికి కావలసిన కోర్కెలన్ని నోరు వాయి లేకపోయినా సాధించుకో గలుగుతారు.

పుణ్యస్య ఫలమిచ్ఛన్తి
పుణ్యం నేచ్ఛన్తి మానవాః
న పాప ఫలమిచ్ఛన్తి
పాపం కుర్వన్తి యత్నతః 40

భా॥ లోకంలో జనులు పుణ్యకార్యాల వల్ల రాదగిన ఫలాన్ని కావాలని కోరుకుంటారు. కాని పొరపాటున కూడా పుణ్యకార్యాలు చేయనే చేయరు. పుణ్యకార్యాలు చేసే తీరిక, ఓపిక వారికి లేదేమో! పాపకార్యాల వల్ల రాబోయే ఫలం పొరపాటున కలలోనైనా కోరుకోరు. కాని పాపపు పనులు ప్రయత్నపూర్వకంగా చేస్తుంటారు. ఇది మానవనైజం.

దాసీభృత్య స్సుతో బంధుః
వస్తు వాహన మేవ చ ।
ధన ధాన్య సమృద్ధిశ్చా
హ్యష్టభోగాః ప్రకీర్తితాః ॥ 41

భా॥ కనుసైగలతో సమస్త పనులు చేసే దాసదాసీజనము, బయట వ్యవహారములు చక్కదిద్దగల నమ్మకస్తులైన సేవకులు, కొడుకులు, కూతుళ్ళు, ఆపదలో ఆదుకొనే బంధుగణము, బంగారు, వెండి మున్నగు విలువైన వస్తువులు, 'హీరోహోండా'ల్లాంటి క్షణంలో ఆయాసం లేకుండా తీసికెళ్ళే వాహనాలు; ఎనలేని ధనము, ధాన్య సంపత్తి; యీ ఎనిమిది అష్టవిధములైన భోగాలుగా పేర్కొనబడ్డాయి.

ఋణం యాచ్నాచ వృద్ధత్వం
జార చోర దరిద్రతాః ।
రోగశ్చ । భుక్త శేషశ్చా
హ్యష్టకష్టాః ప్రకీర్తితాః ॥ 42

భా॥ విపరీతమైన అప్పుల ఊబిలో దిగవలసిరావడం, భిక్షుకవృత్తిలో కాలం గడపవలసి రావడం, ముందు అడుగుపడని ముదిమితో బాధపడవలసి రావడం, వ్యభిచారిగా మనుగడ సాగించడం, దొంగతనముతో కాలము పుచ్చడము, గర్భదారిద్ర్యముతో బాధలను భరించవలసిరావడం, శారీరక బాధలు, ఎంగిలికూడు తినవలసిరావడం అనే యీ ఎనిమిది అష్టకష్టాలుగా చెప్పబడుతున్నాయి.

కాకః కృష్ణః । పికః కృష్ణః ।
కో భేదః పిక కాకయోః ?
వసంత కాలే ప్రాప్తే
కాకః కాకః । పికః పికః ॥ 43

భా॥ కాకి నలుపే కోకిలయూ నలుపే, మరి యీ రెంటికీ తేడా ఏమిటి? వసంతకాలం వచ్చీ రాగానే కాకి కంఠం కావు కావు మనీ; కోకిల కంఠం కుహూ కుహూ అని ధ్వనిస్తాయి. కాకి గూట్లోనే పెరుగుతుంది కోకిల. అందుకే దాని 'పరభృతం' అని అన్నారు. రూపం ఒకటైనా స్వరంవల్ల మాత్రమే యీ రెంటికి భేదం తెలుస్తుంది. దుర్జనుడికి, సజ్జనునికి సందర్భం వచ్చినప్పుడు మాత్రమే తేడా తెలుస్తుంది.

గంగాపాపం । శశీ తాపం ।
దైన్యం కల్పతరుస్తథా ।
పాపం, తాపం చ దైన్యంచ ।
హన్తి సజ్జనదర్శనమ్ ॥ 44

భా॥ గంగాదేవి (స్నానం) సమస్త పాపుల యొక్క పాపాలను కడిగివేయగలదు. పండువెన్నెల (చంద్రుడు) ఎటువంటి తాపాన్నైనా పోగొట్టి ఆహ్లాదపరచ గలదు. కల్పవృక్షము తలుచుకొంటే ఎంతటి దీనుణ్ణైనా ధనికుడిగా మార్చగలదు. కాని సజ్జన దర్శనమున్నచో పాపాన్ని, తాపాన్ని, దైన్యాన్ని పోగొట్టగలదు. సజ్జన దర్శన, స్పర్శన, భాషణములు అంత ఘనమైనవి.

సర్వస్య గాత్రస్య శిరః ప్రధానమ్ ।
సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్ ।
షణ్ణాం రసానాం లవణం ప్రధానమ్ ।
భవే న్నదీనాం ఉదకం ప్రధానమ్ ॥ 45

భా॥ శరీరానికంతటికి ఆజ్ఞలు జారీజేసే కేంద్ర ప్రభుత్వ సదృశమైన శిరస్సు ప్రధానమైనది. దానికేదైనా ముప్పువాటిల్లితే దేహాని కంతటికి ముప్పుసంభవించినట్లే లెక్క. పంచేంద్రియాలలో చూడగానే సమస్తాన్ని పసిగట్టగలిగే కన్ను ముఖ్యము. కన్నే లేకుంటే జగమే సున్న. షడ్రుచులను అందించి, మనిషికి స్వర్గాన్ని చూపించే షడ్రసాలలో లవణము మిన్న. ఎంత నలభీమపాకమైనా ఉప్పులేకుంటే చప్పనే. నీరాన్నిచ్చి బీడులను సైతం సారవంతంగా చేసే నదులకు నీరే ప్రధానము. నీరు లేని నదిని పోల్చుకోలేము గదా!

అర్థాతురాణాం న గురుర్న బంధుః ।
కామాతురాణాం న భయం న లజ్జా ।
విద్యాతురాణాం న సుఖం న నిద్రా ।
క్షుధాతురాణాం న రుచిర్న పక్వమ్ ॥ 46

భా॥ ధనమూలం మిదం జగత్ అనిగదా ఆర్యోక్తి. ఆ ధనానికి దాసుడై, బానిసయై, దురాశాపరుడైన వానికి వీడు పెద్ద, చిన్న అనిగాని, వీడు చుట్టమనిగాని, మిత్రుడు అనిగాని, హితుడని గాని, సన్నిహితుడని గాని విచక్షణ ఉండదు. అందరి వద్ద నిష్కర్షగా డబ్బు గుంజేస్తాడు. కామంతో కళ్ళు కప్పినవానికి వావివరసలు గాని, యుక్తము, అయుక్తము అనిగాని, సమయము, సందర్భము, ప్రాంతము అనిగాని విచక్షణ కోల్పోయి లజ్జా భయాలు ఉండవు. కోరిక తీర్చుకొనుటయే ఏకైక లక్ష్యంగా ఉంటాడు. చదువుకొనే వాడికి సుఖము, నిద్ర పట్టవు. గమ్యసాధనయే వారి ధ్యేయం. ఆకలితో అలమటించే వారికి రుచులు పట్టవు. ఉడికిందా లేదా అనేది పట్టదు. దొరికిందేదైనా అమృతంగా భావించి పొట్టనింపుకుంటాడు.

హరిణాపి హరేణాపి
బ్రహ్మణాపి సురైరపి
లలాట లిఖితా రేఖా
పరిమార్ష్టుం న శక్యతే ॥ 47

భా॥ మనం పుట్టీ పుట్టగానే మన బాగోగులను తెలిపే జాతకచక్రం ఒకే ఒక గీతగా నుదుట వ్రాయబడుతుందని పెద్దలు చెబుతుంటారు. అలా గీయబడిన ఆ గీతను చెరపడం గాని, మార్చి తిరగవ్రాయడంగాని, రికమండేషన్ మీద సవరణ చేయడంగాని బ్రహ్మవిష్ణు మహేశ్వరుల వల్ల కూడా కాదు. కాల నిర్ణయపట్టిక ప్రకారం అన్ని జరిగిపోవలసిందే సుమా!

మణిర్లుఠతి పాదేషు
కాచః శిరసి ధార్యతే
యథైవాస్తే తథైవాస్తాం
కాచః కాచో మణిర్మణిః ॥ 48

భా॥ ప్రకాశవంతమైన, విలువైన, శిరోధార్యములైన మణులను కాళ్ళ క్రింద పడేసి త్రొక్కండి గాక! గాజుముక్కలను వాటికి లేని ప్రకాశాన్ని, విలువను ప్రాముఖ్యాన్ని తెచ్చిపెట్టేందుకు తలపై ధరిస్తే ధరించండిగాక! మీరింకా వాటిని ఎలా చేయాలనుకొంటే అలా చేయండి గాక! విశేషమేమంటే మణి మణే! గాజుముక్క గాజుముక్కే.

తస్కరస్య వధో దండః । - దాసీ దండస్తు ముండనమ్ ।
భార్యాదండః పృథక్శయ్యా । - మిత్రదండ మభాషణమ్ ॥ 49

భా॥ పేరుమోసిన హంతకులకు, గజదొంగలకు, వివిధ దోపీడీల్లో అమాయకుల ప్రాణాలను సజీవంగా హరించిన ఆకతాయిలకు ఉరికంబమే సరియైన శిక్ష. సేవకవృత్తిలో ఘోర తప్పిదాలు చేసినవారికి క్షురకర్మయే (తలగొరుగుటయే) తగిన శిక్ష. సంసారంలో సరిగమలు కాస్తా విరసంతో పదనిసలైనప్పుడు వేరు వేరు ప్రక్కలపై పరుండుటయే భార్యాభార్యలకు ఒకరినొకరు విధించుకొనదగిన శిక్ష. తనకు నచ్చని, తగని పనులేమైనా మిత్రులు చేసినపుడు వారితో మాట్లాడకుండా మౌనంగా ఉండడమే మిత్రునికి మనం విధించదగిన శిక్ష. 'మౌనేన కలహం నాస్తి' అని పెద్దల సూక్తి.

వస్త్రేణ వపుషా వాచా - విద్యయా వినయేన చ
వకారైః పంచభిర్హీనః - వాసవోపి న పూజ్యతే । 50

భా॥ వృత్తిపరంగాను, వ్యక్తిత్వపరంగాను, గుణగణాలను ఇట్టే పసిగట్టడానికి దోహదపడి అందచందాలను ఇనుమడింపజేసే చక్కని బట్టలు; చక్కని శరీర సంపద; యుక్తాయుక్తాలు, ఉచితానుచితాలు, సమయానుగుణమైన చక్కని మృదు మధుర భాషణాచాతుర్యము; తనను తానే గాక మన చుట్టూవారిని కూడ చైతన్యపరచి, వారి శ్రేయస్సుకుపయోగపడే విద్యా సంపద, జ్ఞాన వయోవృద్ధుల సమక్షంలో వారిని మంత్రముగ్ధులను చేయగల్గిన వినయ సంపద ఈ ఐదు వకారాలు మానవుణ్ణి మహనీయునిగా తీర్చిదిద్దుతాయి. ఇవి లోపించినప్పుడు సాక్షాత్తు ఇంద్రుడు కూడా పూజార్హత కోల్పోతాడు.

ఉద్యోగం కలహః కండూః - ద్యూతం మద్యం పరస్త్రియః
ఆహారో మైథునం నిద్రా - సేవనాత్తు వివర్ధతే ॥ 51

భా॥ అష్టైశ్వర్యాలు ఆశించకుండానే లభింపజేసి, అష్టభోగాలతో నిరంతరము ముంచితేల్చే అధికారము; తనది తప్పని తెలిసి కూడా ఎదుటివాణ్ణి చిత్ర విచిత్రంగా ఇరకాటంలో పెట్టి చేసే వితండవాదము; గజ్జి, తామర వ్యాధులవల్ల గలిగే ఎడతెగని దురద; చీట్లపేక; మద్యపానము; పరస్త్రీ కాంక్ష; షడ్రసోపేతమైన పసందైన విందు భోజనము; దాంపత్య సుఖము; కష్టాలను, క్లేశాలను, గృహ సమస్యలను, పిల్లల చదువు, అమ్మాయి పెండ్లివంటి సమస్యలను మరిపింపజేసే ఏకైక తాత్కాలిక పరిష్కారమైన నిద్ర. ఈ తొమ్మిందిని మీరు సేవించే కొద్దీ తృప్తితీరకపోగా ఇంకా..ఇంకా..ఇంకా కావాలని అనిపిస్తూ మనల్ని నిజంగా పిచ్చివాళ్ళను చేస్తాయి.

వరమేకో గుణీ పుత్ర :
నచ మూర్ఖ శతాన్యపి
ఏకశ్చంద్రః తమో హన్తి
నచ తారాగణోపిచ ॥ 52

భా॥ సద్గుణవంతుడు, శీలవంతుడు, వివేకవంతుడు, లోకజ్ఞానియైన ఒక కొడుకు చాలు. గుణహీనులు, శీలరహితులు, అవివేకులు, సంస్కారహీనులు నైన మూర్ఖులు నూఱుగురు కొడుకులవలన ఏమి లాభము? ఆకాశంలో మిల మిల మెరిసే నక్షత్రాలు కోట్లకొలది ఉన్నాయి. కాని లాభమేముంది. ఒక్క పున్నమినాటి చంద్రుడు దయించగానే చీకట్లు వైదొలగుతాయి. ఆహ్లాదం కలుగుతుంది. అందుకనే ఆయన అందరికి 'మామ' అయినాడు.

మధ్యాహ్నకాలే మలినాంబరాణాం
ప్రక్షాళనార్థం రజకః కరాభ్యామ్
పాషాణ ఘాతేన కరోతి శబ్దం
బీ బీ బి బీ బీ బి బి బీ బి బీ బీ ॥ 53

భా॥ ఒక చాకలివాడు మధ్యాహ్న సమయంలో విడిచిన గుడ్డలనన్నింటిని సేకరించుకొని, రేవు దగ్గరకి వచ్చాడు. వాటి మురికిని వదలించడానికి బండకేసి బాదడం మొదలుపెట్టాడు. ఆ సందర్భంలో ఆ గుడ్డలుతికే చప్పుడు యిలా వుందని కవి చమత్కరించాడు. ఆ శబ్దమే బీబీ బి బీబీ బిబి బీబి బీ బీ అని.

క్షణశః కణశశ్చైవ
విద్యా మర్థంచ సాధయేత్ ॥
క్షణత్యాగే కుతో విద్యా?
కణత్యాగే కుతో ధనమ్ ॥ 54

భా॥ క్షణ క్షణము వజ్ర వైఢూర్యములకంటె విలువైనదిగా భావించి, విద్యార్జన చేయాలి. అలాగే కణంకణం పోగుచేసి అంటే పైసా పైసా కూడబెట్టి ధనాన్ని సంపాదించాలి. ఒక్క క్షణం పోతే, యీ రాకెట్‌యుగంలో వేగంగా దూసుకుపోతున్న విజ్ఞానాన్ని ఎలా పొందుతావు? ఒక్క పైసా నష్టపోతే నీవు ధనాన్ని ఎలా కూడబెడతావు? ధనార్జన గమ్యాన్ని ఎలా చేరుకుంటావు. క్షణక్షణము విద్యనూ, కణంకణంగా డబ్బును గడించాలి.

సుఖార్థీ త్యజతే విద్యాం ।
విద్యార్థీ త్యజతే సుఖమ్ ।
సుఖార్థినః కుతో విద్యా?
కుతో విద్యార్థిన స్సుఖమ్ ॥ 55

భా॥ సుఖాన్ని కోరుకునేవాడు చదువును వదిలివేయాలి. చదువును కోరుకునేవాడు సుఖాన్ని వదిలివేయాలి. సర్వసుఖాల్లోను మునిగితేలేవాడికి చదువెందుకు అబ్బుతుంది? కష్టపడేవాడికి సర్వవిద్యలు వశమౌతాయి. ర్యాంకులు సాధిస్తాడు. పదవులు అలంకరిస్తాడు. శోభిస్తాడు. అలాంటి విద్యార్థి జీవితంలో సుఖపడి ఎరుగడు. నిజమైన విద్యార్థికి సుఖమంటే ఏమిటో తెలియదు సుమా!

రాజ్యాభిషేకే మదవిహ్వలాయాః
హస్తచ్యుతో హేమఘటో యువత్యాః
సోపాన మార్గేషు కరోతి శబ్దం
టం టం ట టం టం టటటం ట టం టం ॥ 56

భా॥ యువరాజుకి పట్టాభిషేకం జరుగుతోంది. చాలామంది చెలికత్తెలు తమ తమ పనుల్లో నిమగ్నమయ్యారు. వారిలో ఒక చెలికత్తె మద్యాన్ని సేవించి బాగా తూలుతోంది. ఆమె చేతిలో బంగారు బిందె ఉన్నది. మెట్లమీదుగా క్రిందికి నడచి వస్తోంది. అలాంటి సమయంలో పొరపాటున ఆబిందె మెట్ల మీద జారిపడింది. ఆ పడిన బిందె 'టం టం ట టం టం ట ట టం ట టం టం' అని శబ్దం చేస్తూ అందరిని ఆశ్చర్యంలో ముంచెత్తింది.

అతిథి ర్బాలకశ్చైవ - స్త్రీజనో నృపతిస్తథా
ఏతే విత్తం న జానన్తి - జామాతా చైవ పంచమః 57

భా॥ తను వచ్చిన వేళా పాళా చూసుకోకుండా వేణ్ణీళ్ళ దగ్గర నుండి ఉలవచారు దాకా కావాలని అడిగి చేయించుకొని తృప్తిపడే స్వభావంగల అతిథి; తాను బట్టిన కుందేటికి మూడు కాళ్ళని దాన్ని తెస్తే గాని వీలుకాదని మారాం చేసే బాలకుడు, తాను కోరిన నగలు, పట్టు పీతాంబరాలు కావాలని అపి తెప్పించుకొన్నదాక నిద్రపోని భార్యామణి, ఏది ఏమైనా రోడ్డు విస్తరణలో అడ్డమొచ్చిన బిల్డింగులను పడగొట్టి తీరాలనే గవర్నమెంటు, (కప్పం కట్టి తీరాలనే రాజు) హీరోహోండా కొంటేనే గాని కాపురం చేయననే అల్లుడు వీళ్ళైదుగురు మన ఆర్థిక స్థితిని పరిగణనలోనికి తీసుకోరు.

చింతా జ్వరో మనుష్యాణాం । వస్త్రాణా మాతపో జ్వరః ।
అసౌభాగ్యం జ్వరః స్త్రీణాం । అశ్వానాం మైథునం జ్వరః 58

భా॥ ఆర్చలేని తీర్చలేని బాధనే జ్వరంగా భావించినట్లయితే మానవమాత్రు లందరికి "దిగులు"; మండుటెండలో ఆరబెట్టిన బట్టలకు తీవ్రమైన ఎండ; శారీరకంగా, మానసికంగా ఎంతో నుతిమెత్తని స్వభావముగల నారీమణులకు వైధవ్యము (భర్త వలని ఎడబాటు); వాయు వేగ మనో వేగాలతో పోటీపడి పరుగెత్తే గుఱ్ఱాలకు రతిక్రీడ మిక్కిలి మిక్కుటంగా బాధను కల్గిస్తాయి.

విద్యా వివాదాయ । ధనం మదాయ । శక్తిః పరేషాం పరపీడనాయ।
ఖలస్య సాధోః విపరీతమేతత్।జ్ఞానాయ దానాయచ రక్షణాయ ॥ 59

భా॥ చదువు; డబ్బు; బలము ఈ మూడును మంచివాడిలోను, చెడ్డవాడిలోను ఎలాంటి మార్పులు తెస్తాయో చూద్దాం. చెడ్డవాడు విద్యావంతుడైతే వితండ వాదంచేత, తాను బట్టిన కుందేటికి మూడెకాళ్ళని మూర్ఖంగా వాదిస్తాడు. గెలుపు తనదే అని మురిసిపోతాడు. ధనవంతుడైతే గర్వంతో పొంగిపోతూ అకృత్యాలు, అన్యాయాలు చేసి విఱ్ఱవీగుతాడు. బలవంతుడైతే తానే రౌడీ షీటరై పేటలో తనకెదురులేదంటాడు. ఇష్టారాజ్యం చేస్తాడు. పరులను హింసిస్తాడు. అదే మంచివాడు విద్యావంతుడైతే తాను విజ్ఞానియై పదిమందికి జ్ఞానామృతం పంచుతాడు. ధనాన్ని నిరుపేదలకు దానం చేస్తాడు. ధర్మకార్యాలు చేస్తాడు. పరోపకార పరాయణుడౌతాడు. శక్తిమంతుడైతే అన్యాయాన్ని, అక్రమాన్ని ఎదిరించి నీతికి, న్యాయానికి పట్టం గడతాడు.

కర్తా కారయితా చైవ - ప్రేరక శ్చానుమోదకః
సుకృతే దుష్కృతే చైవ - చత్వార స్సమభాగినః 60

భా॥ కర్తా :- ఏ పనైనా, ప్రత్యక్షంగా కాని, పరోక్షంగా గాని చేసేవాణ్ణి 'కర్తా' అంటారు. పనిచేసేవాణ్ణి 'కర్త' అంటారు.

కారయితా : పనిని చేయించేవాడు. అంటే ఆ పనిని అయ్యే ఖర్చు హంగు, ఆర్భాటం ఏర్పాటు చేసేవాడు.

ప్రేరకః : ఆ పని జరగడానికి తగిన ఉత్సాహ, ప్రోత్సాహాలనిచ్చేవాడు, కష్టా లెదురైనా నీరసపడకుండా చేసి, పని జరగడానికి తగిన ప్రతికూలత తొలగించేవాడు.

అనుమోదకః :- ఆ పనిని చూస్తూ అన్యాయమని, అక్రమమని తెలిసినా ఉదాసీనంగా, మౌనంగా ఆమోదం తెలిపే అనుచరులు. ఈ నలుగురు అది పాపకార్యమైనా, పుణ్యకార్యమైనా సమానభాగస్వాములే.

యత్ర నార్యస్తు పూజ్యన్తే - రమన్తే తత్ర దేవతాః
యత్రైతాస్తు న పూజ్యన్తే - సర్వా స్తత్రా ఫలాః క్రియాః ॥ 61

భా॥ ఎక్కడైతే స్త్రీలు సాదరంగా గౌరవింపబడతారో అక్కడ ముక్కోటి దేవతలు అమందానందం పొందుతారు. ఎక్కడైతే స్త్రీలు నిరాదరంగా అగౌరవింప బడతారో అక్కడ సమస్తకార్యములు మొక్కుబడిగా జరిగి, నిష్ఫలమౌతాయి. అందుకనే మన దేశంలో స్త్రీలకు విశిష్ట స్థానమున్నది. మాతృదేవోభవ అంటారు. పార్వతీ పరమేశ్వరులు, గౌరీశంకరులు, లక్ష్మీనారాయణులు ఇలాంటి ప్రయోగాలలో స్త్రీలపేర్లనే ముందు వాడతారు. గృహిణి లేని యిల్లు గృహము కాదంటారు. 'అడవి'గా వర్ణిస్తారు. భార్యలేకపోతే కన్నబిడ్డల పెళ్ళిళ్ళు చేయడానికి కూడా అర్హుడుకాడు. స్త్రీకి గల స్థానము అంతటి ముఖ్యమైనది.

కూపోదకం । వటచ్ఛాయా । - తాంబూలం । తరుణీకుచౌ ।
శీత కాలే భవే దుష్ణమ్ । - ఉష్ణకాలే తు శీతలమ్ ॥ 62

భా॥ లోకంలో ఇప్పటికి అధికసంఖ్యాకులైన ప్రజలకు అందుబాటులో ఉంటున్నాయి బావులు. అలాంటి 'బావినీరు; అలసి, సొలసి బ్రతుకుతెరువు కోసం అహర్నిశలు రెక్కలు ముక్కలు చేసుకొనే శ్రామికులనుండి కారుపంచరై, అతిగతిలేక సేదతీర్చుకోవడానికై నిలబడ్డ కోటేశ్వరుల వరకు తన ఆశ్రయాన్నిచ్చే మఱ్ఱిచెట్టు నీడ; 27 సుగుణాలచే శరీరంలోని అంగాంగాలకు నూతన స్ఫూర్తినిచ్చే తాంబూలము; విశ్వామిత్రుని వంటి మహామునులను సైతం మురిపించి, మరపించిన సుందర సుమనోహర 'తరుణీ కుచ మండలము; ఈ నాలుగున్ను శీతాకాలంలో వెచ్చదనాన్ని; మండు వేసవిలో చల్లదనాన్ని యిస్తాయి. శరీరోష్ణాన్ని సమతుల్యం చేస్తాయి.

భోజనాత్ పూర్వభాగేచ । - భోజనాత్ పరతస్తథా ।
క్షణే క్షణే మతిర్భిన్నా । - ధర్మస్య త్వరితా గతిః ॥ 63

భా॥ షడ్రసోపేతమైన భోజనానికి ముందు మన మనస్సు అది చేయాలని యిది తీయాలని తహతహలాడుతుంది. ఉవ్విళ్ళూరుతుంది. భోజనం ముగుస్తుంది. ఈ లోపల మనసులో అంతర్మథనం జరుగుతుంది. అది చేస్తే ఉపయోగ మేమిటి? యిది చేస్తే లాభమేమిటి? అది యిది కాక మరొకటి చేస్తే పోలా! అనే మీమాంస బయలుదేరుతుంది. క్షణక్షణానికి మనస్సు పరిపరివిధాలా, భిన్నాలోచనలతో ఛిన్నాభిన్నమై ఏదీ చేయనివ్వదు. కాబట్టి ధర్మకార్యం చేయాలని తలంపురాగానే వెంటనే దాని కప్పటికప్పుడే త్వరగా చేయడం మంచిది.

**ఉత్సాహ స్సాహసం ధైర్యం - బుద్ధిశ్శక్తిః పరాక్రమః**
**షడేతే యత్ర తిష్ఠన్తి - తత్ర దేవోపి తిష్ఠతి** 64

భా॥ ఉత్సాహము; ఎన్ని కష్టాలనైనా ఎదుర్కొనగలిగే సాహసము; గుండెధైర్యము; తెలివితేటలు; కార్యసాధనకు తగిన శక్తి ; పరాక్రమము ఈ ఆరున్నూ ఎక్కడ ఉంటాయో అక్కడ దేవుడుంటాడు. ఆరు లక్షణాలున్నప్పుడు మనము చేయ తలపెట్టిన యేపనైనా నెరవేరుతుంది. అందుకు పరోక్షంగా దైవాశీస్సులుండనే ఉంటాయి. ఈ ఆరింటిలో ఏది లేనప్పుడు పని పూర్తికాలేదని దేవుణ్ణి తిట్టినా ఏం లాభం లేదు సుమా!

**మితం దదాతి హి పితా । - మితం మాతా । మితం సుతః ।**
**అమితస్యతు దాతారం । - భర్తారం కా న పూజయేత్ ॥** 65

భా॥ జన్మనిచ్చిన తండ్రి ఆలనా పాలనా చేయగలిగినా స్త్రీకి కొద్దిగా మాత్రమే అడిగినది యివ్వగలడు. కన్నతల్లి అక్కునజేర్చుకొని, మిక్కిలి మక్కువ జూపినా అడిగినదంతా యివ్వలేదు. అలాగే కొడుకున్నూ కోడలి అడుగుజాడలలో, కనుసన్నలలో నడిచేవాడే కాబట్టి అతడివ్వగలిగింది అంతంతమాత్రమే. ఏతావతు అడిగిందడిగినట్లు తెమ్మన్నది, కావాలన్నది ఒకటికి రెండురెట్లు తెచ్చియివ్వగలిగేది భర్త మాత్రమే. అలాంటి ప్రాణ వల్లభుని ఏ భార్య మాత్రము ఆదరంగా ఆరాధించకుండా ఉండగలదు?

**కృషితో నాస్తి దుర్భిక్షమ్ । - జపతో నాస్తి పాతకః ।**
**మౌనేన కలహో నాస్తి । - నాస్తి జాగరతో భయమ్ ॥** 66

భా॥ 'కృషి' అనగా శ్రమ అనీ, వ్యవసాయమనీ అర్థము. కాయకష్టం చేసి బీడుభీముల్ని సస్యశ్యామలం చేయగలిగిననాడు దుర్భిక్షం - (కరువు కాటకాలు) ఉండే పనేలేదు. పాతకం అంటే పాపం. మానవజన్మలో తెలిసో తెలియకో పాపాలు చేయడం జరుగుతుంది. అలాంటి పాతకాలన్ని జపాల వల్ల ప్రక్షాళన మౌతాయి. నోటి తుత్తర, దురద వల్లనే సామాన్యంగా తగాదాలు వస్తాయి. అలాంటి నోరే అసలు మూసుకొని కూర్చుంటే తగాదాలే ఉండవు. కొంచెం కునుకు తీశామా! నిలువుదోపిడీ చేసే రోజులివి. ఎప్పుడూ మేలుకొనిగాని, జాగరూకత గాని కలిగిఉంటే భయమనేదే లేదు. అభయమే.

విద్యత్త్వంచ నృపత్వంచ - నైవ తుల్యం కదాచన ।
స్వదేశే పూజ్యతే రాజా । - విద్వాన్ సర్వత్ర పూజ్యతే ॥ 67

భా॥ పాండిత్యము, రాచరికము ఈ రెండును ఎప్పుడును, ఎక్కడను, ఏ సందర్భములోను సరిసమానము కాలేవు. కాజాలవు. ఈ రెంటికి తేడా హస్తిమశకాంతరము. పాండిత్యము నిత్యనూతనమై, ఇంతింతై, వటుడింతై అన్న చందాన రాకెట్ స్పీడులో పెరిగిపోతూ అసమానంగా శోభాయమానంగా ఉంటుంది. రాచరికము మిక్కిలి గొప్పది, ఉన్నతమైనప్పటికి క్షణ భంగురమై, దినదినగండం నూరేండ్లాయుష్షు వోలె రాలిపోయే తారలా అలా మెరిసి యిలా మాయమౌతుంది. అందుచే రాజు తనదేశములోమాత్రమే పూజలందుకొనుచుండగా పండితుడు సర్వత్ర, సర్వదా, సర్వధా పూజలందుకొంటాడు.

న గృహం గృహమిత్యాహు : - గృహిణీ గృహముచ్యతే
గృహం తు గృహిణీహీనం - అరణ్య సదృశం మతమ్ 68

భా॥ ఆ యిల్లు పూరిల్లైనా, ఏడంతస్థుల మేడైనా కేవలం ఇంటిని మాత్రమే "గృహము" అని అనరు, అనబడదు. ఆ యింటిలో ఇల్లాలుంటేనే గృహము అనబడుతుంది. లేనిచో అది యిల్లే కాదు. అది అరణ్యమే. అందుకనే "ఆలయాన వెలసిన ఆ దేవుని రీతి ఇల్లాలే ఈ జగతికి జీవనజ్యోతి" అన్నారు. గృహలక్ష్మి, భాగ్యలక్ష్మి యిత్యాదిగా బిరుదులిచ్చి సాదరంగా ఆదరించారు.

జనితా చోపనీతా చ । - యశ్చ విద్యాం ప్రయచ్ఛతి
అన్నదాతా భయత్రాతా - పంచైతే పితరః స్మృతాః ॥ 69

భా॥ జన్మనిచ్చిన తండ్రి; కర్మచక్షువులనే గాక జ్ఞాన చక్షువును తెరిపించి, ఉపనయన ప్రక్రియను చేపట్టినవాడు; మూడవ నేత్రముగా భావించబడి సన్మార్గమున నడిపింపజేయ నుద్దేశించిన విద్యాప్రదాత; అన్నమో రామచంద్రా! యని యలమటిస్తున్నప్పుడు అన్నమును పెట్టినవాడు, విపత్కరమైన, అనూహ్యమైన భయంకర విపత్తునుండి ప్రాణాలను కాపాడి రక్షించినవాడు ఈ యైదుగురున్నూ "పంచ పితరులు"గా ఖ్యాతినొందుచున్నారు.

రాజపత్నీ గురోర్పత్నీ - భ్రాతృపత్నీ తథైవచ
పత్నీమాతా స్వమాతా చ - పంచైతే మాతరః స్మృతాః 70

భా॥ సకల సామ్రాజ్యాధినేతయైన రాజుకు భార్యయై సర్వులకు తన కటాక్ష వీక్షణాలచే చల్లగా చూడజాలిన రాజపత్ని; జ్ఞాన ప్రదాతయైన గురువు గార్కి పత్నియై శిష్యుల ఆలనా పాలనా చూసే గురుపత్ని; తండ్రి తరువాత తండ్రితో సమానమైన అన్నగార్కి భార్యయై కుటుంబభారం మోస్తూ వారి బాగోగులను సామరస్యంగా, సాదరంగా పరిష్కరింప జాలిన వదినెగారు; ప్రాణవల్లభుడైన భర్తకు తల్లియై, కోడలిని సైతం కూతురుగా చూచుకొనే అత్తగారు; తనను నవమాసములు మోసి, కనిపెంచిన తల్లి; యీ యైదుగురు "పంచ మాతలు"గా లోకంలో ఎనలేని కీర్తి గడించుచున్నారు.

మక్షికాః వ్రణ మిచ్ఛన్తి - ధన మిచ్ఛన్తి పార్థివాః
నీచాః కలహ మిచ్ఛన్తి - శాంతి మిచ్ఛన్తి సాధవః । 71

భా॥ ఈగలు చెడురక్తము, మలము, కాలుష్యముతో కూడిన పుండ్లను ఏరి, కోరి, చేరి ఆస్వాదనచేయును. రాజులు శాసనాలద్వారా ప్రజాధనాన్ని పన్నుల రూపేణ ప్రత్యక్షంగానో, పరోక్షం గానో సమీకరణకై యోచి స్తుంటారు. నీచులు ప్రతి మాటలోను విపరీతార్థాలు తీసి, వితండ వాదం చేస్తూ కలహప్రియులై విచిత్రమైన ఆనందాన్ని పొందుతుంటారు. ఇక సాధువులు తమ సాంత్వనమైన బోధలచేత, వాక్సుధారసము చేత అశాంతిని సైతం ఉపశమింపజేసి, శాంతిని, సామరస్యాన్ని సమాజంలో నెలకొల్ప ప్రయత్నిస్తుంటారు. మొదటి మూడింటి విషయంలో అప్రమత్తంగా ఉంటూ, సాధుజన దర్శన, స్పర్శన, భాషణల పట్ల ఆసక్తి పెంచుకోవాలి.

విద్యా మిత్రం ప్రవాసేషు - భార్యా మిత్రం గృహేషు చ
వ్యాధిత స్యౌషధం మిత్రం - ధర్మో మిత్రం మృతస్య చ॥ 72

భా॥ ప్రతిభాపాటవాలతో ఉన్నత విద్యనభ్యసించి విదేశాల్లో నివాసముండ వలసిన వారికి, తోడునీడలాగా మిత్రుడిలా కొండంత అండగా ఉండేది విద్యయే. ప్రతివారికి పెళ్ళి చూపుల్లోనే పెనవేసుకొన్న బంధం, ఏడగుల పవిత్రబంధమై, ధర్మార్థకామాల్లో "నాతిచరామి" అని ఒప్పందం కుదుర్చుకొని, సహధర్మచారిణియైన భార్యయే షట్కర్మయుక్తయై గృహసీమయందు మిత్రురాలిగా ఉంటుంది. రోగగ్రస్తునకు ఇలా వేసుకోగానే అలా ఉపశమనం కలిగించి, నరకాన్నుండి స్వర్గానికి దారి చూపే మందే సరియైన మిత్రుడు. మృతునికి అతడు చేసుకొన్న ధర్మమే అన్ని లోకములందు మిత్రుడిగా అనుసరించి, అతని వ్యక్తిత్వాన్ని అడుగడుగునా చాటుతుంది. అందుకనే 'ధర్మస్యత్వరితా గతిః" అని పెద్దలు పదే పదే చెబుతారు.

ఆత్మ నామ గురోర్నామ
నామాతి కృపణస్యచ
శ్రేయస్కామో నగృహ్ణీయాత్
జ్యేష్ఠా పత్య కళత్రయోః 73

భా॥ శ్రేయస్కామి (మేలుకోరేవాడు) తన పేరును నా పేరు ఫలానా అని చెప్పకూడదు. నన్ను మాధవరావు అంటారండి అనాలి. అలాగే గురువు గారి పేరు సూటిగా చెప్పరాదు. పైవిధంగా చెప్పాలి. మిక్కిలి కృతఘ్నుని పేరు పెట్టి పిలువరాదు. తలచరాదు, జ్యేష్ఠ సంతానము ఆడగాని, మగ గాని పేరుతో పిలువరాదు. అట్లాగే అర్థాంగిని పేరుతో పిలవడం శ్రేయోదాయకము కాదు.

ఏకో దేవః కేశవో వా శివో వా?
ఏకో వాసః పత్తనం వా వనం వా
ఏకం మిత్రం భూపతిర్వాయతిర్వా
ఏకా నారీ సుందరీ వా దరీ వా! 74

భా॥ దేవుడు ఒక్కడే. శివుడో! కేశవుడో ఒకరినే ఆరాధించుము. సకల సుఖాలతో పట్టణంలో భోగిగా ఉండదలిచావో! విరాగివై వనవాసం చేస్తావో నిర్ణయించుకో! కట్టుబాట్లు, నియమాలు, శాసనాలు మున్నగు వాని మధ్య కట్టడిలో ఉంచే రాజు మిత్రుడుగా కావాలో! ముక్కు మూసుకొని తపస్సు చేసే యతి మిత్రుడుగా కావాలో! నిర్ణయించుకో! ఇంక సుందరియైన స్త్రీతో కాపురముంటావో! లేక ఏదేని పవిత్ర నదీ తీరంలో మోక్షగామి కాదలిచావో! ఏదో ఒక పద్ధతిని ఎంచుకోవలయును.

ఋణానుబంధ రూపేణ
పశుపత్ని సుతాలయాః
ఋణక్షయే క్షయం యాన్తి
కా తత్ర పరిదేవనా ? 75

భా॥ మనకు ఏనాడో ఋణముండి ఆ ఋణం తీర్చు నిమిత్తమై జన్మజన్మల అనుబంధంగా పశువులు, పతి, పత్ని కుమార్తెలు, కుమారులు, గృహములు, పొలాలు మున్నగునవి ప్రాప్తమౌతుంటాయి. మళ్ళీ ఆ ఋణం తీరగానే అవి నశిస్తాయి. లేక పరాధీనమౌతాయి. మధ్యలో మనలను చేరి మధ్యలోనే మనలను వీడివెళ్ళే పైవాని కోసం మనం పదే పదే పరితపించడంలో అర్థమేముంది?

ధనాని భూమౌ పశవశ్చగోష్ఠే
నారీ గృహద్వారి । జనాః శ్మశానే
దేహశ్చితాయాం । పరలోక మార్గే
ధర్మానుగో గచ్ఛతి జీవ ఏకః 76

భా॥ మనం పరలోకయాత్ర చేయబోయేటప్పుడు మనం సంపాదించుకున్న స్థిర చరాస్థులు ఎక్కడివక్కడ భూమి మీద నిలబడిపోతాయి. పశువులు పశువుల శాలలో ఉండిపోతాయి. చతుర్విధ పురుషార్థాలలో 'నాతిచరామి' అని ప్రతినబూని వచ్చిన అర్ధాంగి గృహద్వారము వద్దనే ఆగిపోతోంది. ఆప్తులు, హితులు, సన్నిహితులైన బంధువర్గము శశ్మాన భూమి వరకు మాత్రమే వచ్చి ఆగిపోతారు. పుణ్యాకార్యాలను, పాపకార్యాలను చేయడానికి మూలాధారమైన దేహము మరో ముందడుగు వేసి, చితిపైన నిలుస్తుంది. చివరగా మనం ఆధ్యాత్మిక సేవింగ్స్ బ్యాంక్‌లో దాచుకొన్న ఏకైక 'ధర్మము' మాత్రమే మనలను వెన్నంటి అనుసరిస్తుంది.

ఇచ్ఛతి శతీ సహస్రం - సహస్రీ లక్ష మీహతే
లక్షాధిపస్తథా రాజ్యం - రాజ్యస్థః స్వర్గమీహతే ॥ 77

భా॥ ఏమి లేనివాడు ఒకవంద రూపాయలన్నా ఉంటే బాగుండుననుకొంటాడు. వందగలవాడు వేయి కావాలని కోరుకుంటాడు. వేయిగలవాడు లక్ష కావాలని కోరుకుంటాడు. లక్షాధికారి రాజ్యాధికారాన్ని కోరుకొంటాడు. రాజైనవాడు ఇహాన్ని పాలించా గదా! ఇంక స్వర్గాధిపతినైతే బాగుండునని ఉవ్విళ్ళూరుతాడు. చూశారా! ఆశకు, అంతస్థుకు అంతేమైనా ఉందేమో! తృప్తి అనేది లేనప్పుడు పుట్టే వింత వింత కోరికలిలానే ఉంటాయి.

శ్లోకార్థేన ప్రవక్ష్యామి
యదుక్తం గ్రంథకోటిభిః
పరోపకారః పుణ్యాయ ।
పాపాయ పరపీడనమ్ ॥ 78

భా॥ కోట్లాది గ్రంథాలలో మహానుభావులు, యోగులు, జ్ఞానులు, మహాత్ములు ఎన్నెన్నో నీతులు, సూక్తులు, నియమాలు వల్లించారు. వాని సారాంశాన్ని కేవలం అరశ్లోకంలోనే యిలా చెప్పవచ్చు. పరోపకారమే పుణ్యము. పర పీడనమే పాపము. కావున పరోపకారమే జీవితధ్యేయమని తెలుసుకో వలయును. కలలోనైనా పరపీడన తలపెట్టరాదని భావము.

భార్యా వియోగశ్చ । జనాపవాదః।
ఋణస్య శేషం । కుజనస్య సేవా ।
దారిద్ర్యకాలే । ప్రియదర్శనంచ ।
వినాగ్నినా పంచ దహంతి చిత్తమ్ । **79**

భా॥ ప్రియాతి ప్రియమైన జీవిత భాగస్వామి చనిపోవుట; లోకాపనింద; తీర్చవలసిన అప్పు అలాగే మిగిలిపోవడం; దుష్టుడు, దుర్మార్గుడు, పరపీడన పరాయణుడు అని తెలిసినా వాడికి అడుగులోమడుగులొత్తడం; దరిద్రముతో బాధపడేటప్పుడు మూలిగే నక్కమీద తాటికాయ పడ్డచందాన తగుదునమ్మా అని ఆప్తులైన ఆత్మబంధువులు చుట్టపుచూపులా పలకరించడానికి రావడం అనే యీ యైదున్ను నిప్పు లేకుండానే మనస్సును దహించివేస్తాయి.

యస్యాస్తివిత్తం స నరః కులీనః ।
స పండితః । శ్రుతవాన్ । గుణజ్ఞః ।
స ఏవ వక్తా । స చ దర్శనీయః ।
సర్వేగుణాః కాంచన మాశ్రయంతి ॥ **80**

భా॥ లోకంలో డబ్బున్నవాణ్ణే ఉత్తమ వంశ సంజాతునిగా జనాలు కీర్తిస్తారు. ఆయన్నే సర్వము తెలిసిన పండితుడని కొనియాడతారు. ఆయనకే అన్ని తెలుసునని ప్రశంసిస్తారు. ఆయనే సర్వగుణసంపన్నుడని, సకల సద్గుణఖని 'కితాబు' ఇస్తారు. ఆయన్నే ఉపన్యాసకేసరిగా అభివర్ణిస్తారు. ఆయనే ప్రాతః స్మరణీయుడని, చిరస్మరణీయుడని, అభినందనీయుడని, తప్పక దర్శించి తరించదగిన రూపసియని సమ్మతిస్తారు. కాబట్టి యీ లోకంలో కాంచనమునే అన్ని గుణాలు ఆశ్రయిస్తున్నాయి.

విద్వానేవ విజానాతి – విద్వజ్జన పరిశ్రమమ్
న హి వంధ్యా విజానాతి – గుర్వీం ప్రసవ వేదనామ్ ॥ **81**

భా॥ వేదాలు, వేదాంగాలు, ఉపనిషత్తులు, శాస్త్రాలు, అష్టాదశ పురాణాలు / నవసమాజంలో ఇంజనీరింగ్ / వైద్యశాస్త్రం, **Ph.D.** యిలా పలురంగాలలో నిష్ణాతులైన పండితులు పడిన శ్రమ ఆయా రంగాలలో ఆరితేరిన సాటిలేని మేటి పండితులకే తెలియగలదు. మిగిలినవారికే మాత్రం తెలియదు గాక తెలియదు. మహత్తరమైన, బృహత్తరమైన, వాచామగోచరమైన ప్రసవవేదన, తదనుబంధములైన మాతృత్వపు మధిరమలు కన్నతల్లికి తెలియునే కాని గొడ్రాలికే మాత్రము వాసనా ప్రాయముగనైన తెలియవు గదా!

న కశ్చి త్కస్య చిన్మిత్రం । న కశ్చి త్కస్య చిద్రిపుః ।
వ్యవహారేణ జాయంతే । మిత్రాణి రిపవస్తథా ॥ 82

భా॥ లోకంలో ఎవడును ఎవరికీ స్వతహాగా మిత్రుడు కాడు. స్వతహాగా శత్రువు కాడు. పుట్టగానే ప్రాణమిత్రుడు ఏర్పడలేదు. పుట్టీపుట్టగానే బద్ధశత్రువు ఏర్పడలేదు. లోకంలో మనం సంఘజీవులం కాబట్టి ప్రతి పనిలోను ఎవరో ఒకరి తోడ్పాటు కోరుకుంటాం. ఆ తోడ్పాటులోనే మనకు ఇష్టమైన వారు మిత్రులౌతారు. కష్టమైనవారు శత్రువులుగా మారతారు. అంతేకాని జన్మ జన్మాంతర నెయ్యాలు, జన్మ జన్మాంతర కయ్యాలు ఉండనే ఉండవు.

దేశాటనం। పండిత మిత్రతాచ । వారాంగనా।రాజసభా ప్రవేశః
అనేక శాస్త్రార్థ విలోకనంచ। చాతుర్య మూలాని భవంతి పంచ ॥83

భా॥ లోకజ్ఞానాన్ని, సాహితీ సాంప్రదాయాన్ని, ఆచార వ్యవహారాలను, వైభవ ప్రాభవాలను యిలా చూడగానే అలా తెలియజేయగల దేశాటనము; సాహిత్యంలో లోతుపాతులను, సాహితీ సౌరభాలను తెలుసుకొనడానికి పండితులతో మైత్రి; వారాంగనలతో పరిచయము; గోష్ఠులు, చర్చలు, సభలు, సమావేశాలు, దండనలు, మండనలు నిరంతరం జరిగే రాజ్యసభా ప్రవేశము, అసంఖ్యాకమైన శాస్త్రాలు, వానిలోని ధర్మాలు, ధర్మసూక్ష్మాలు అధ్యయనం వలన, అధ్యాపనం వలన ఆకళింపుజేసుకోవడం అనే యీ యైదున్ను ఎంతటి మూర్ఖుణ్ణైనా చక్కని వ్యవహారవేత్తగా తీర్చిదిద్దుతాయి.

శబ్దాదిభిః పంచభిరేవ పంచ
పంచత్వ మాపుః స్వగుణేన బద్ధాః
కురంగ మాతంగ పతంగ మీన
భృంగాః నరః పంచభి రంచితం కిమ్ 84

భా॥ మనకు జ్ఞానేంద్రియాలు ఐదు.
1) శబ్దము (చెవి) 2) స్పర్శ (చర్మము) 3) చూపు (కన్ను) 4) రుచి (నాలుక) 5) వాసన (ముక్కు) ఈ పంచేంద్రియాలలో లేళ్ళు శబ్దమునకు, ఏనుగులు స్పర్శకు, మిడుతలు దృష్టికి, చేపలు రుచికి, తుమ్మెదలు వాసనకు ఆశపడి ఆ యింద్రియముల మూలముననే నాశనము పొందుచున్నవి. ఇంక పంచేంద్రియములకును బద్ధుడైన మానవుడెలా నాశనము కాగలడో చెప్పనలవి కాదు. పైవి ఒక్క యింద్రియము మూలముననే నాశనమొందు చున్నవి.

మితనిద్రో మితాహారో - మితవస్త్ర పరిగ్రహః
మితభాషణ మేకైకం - నరాణాంచ విభూషణమ్ ॥ 85

భా॥ మితమైన నిద్ర; మితమైన ఆహారము; తనకు తగిన స్థాయి బట్టలు ధరించడము; ఎవరితోనైన ఎక్కడ, ఎప్పుడు, ఎంతవరకు అవసరమో అంతవరకే మాట్లాడము; అందరికి భూషణములై అలరారు చున్నవి. అతినిద్ర సోమరితనానికి, అతితిండి శరీరానికి, అతి విలువగల వలువలు దర్పానికి, డంబానికి, అతిభాషణము సర్వానర్థాలకు కారకములు. కావున వానిని పరిమితంగా ఉంచుకోవాలి. "అతి సర్వత్ర వర్జయేత్" అని పెద్దలు చెప్పుచున్నారు.

అభ్యాసాను సరీ విద్యా । - బుద్ధిః కర్మానుసారిణీ ।
ఉద్యోగానుసరీ లక్ష్మీః । - ఫలం భాగ్యాను సారిణీ ॥ 86

భా॥ ఏ విద్యైనా సరే గురుముఖతః నేర్చుకొని, మెలకువలు తెలిసికొని, క్షుణ్ణంగా అభ్యాసం చేస్తే ఆవిద్య స్థిరంగాను, శాశ్వతంగాను చెక్కుచెదరక నిలబడుతుంది. మనం తెలివిగాను, తెలివితక్కువతోను రకరకాలు పనులు చేస్తుంటాము. మంచి జరిగినా, చెడుజరిగినా కర్మల కనుగుణంగానే అలా చెయ్యాలనే బుద్ధి పుడుతుంది. కర్మల ననుసరించియే బుద్ధి వర్తిస్తుంది. అందుకనే "వినాశకాలే విపరీత బుద్ధిః" అంటుంటారు. ఒక ఉద్యోగాన్ని బట్టే మనకు డబ్బు ఒనగూడుతుంది. కష్టపడి పదోన్నతి పొందితే దానిననుసరించే నీ భాగ్యము పెరుగుతుంటుంది. ఆ భాగ్యముల మూలాన మనకు పుణ్య పాపాలు తత్ఫలితాలు ప్రాప్తించుతుంటాయి.

నిమిషం నిమిషార్థం వా - ప్రాణినాం విష్ణు చిన్తనం
క్రతుకోటి సహస్రాణాం - ధ్యాన మేకం విశిష్యతే ॥ 87

భా॥ నేటి అత్యాధునిక యుగంలో మనిషికి భగవంతుని గూర్చి యిసుమంతైనా తలంచే తీరిక, కోరిక, ఓపిక మృగ్యమౌతున్నాయి. వారికో చక్కని మార్గము పదేశింపబడుతోంది. దైనందిన కార్యకలాపాల్లో మునిగితేలుతూనే ఒక నిమిషం గాని, అరనిమిషం గాని ఏకాగ్రతతో ధ్యానం చేయడం మంచిదే. ఆ స్వల్పకాలికమైన, అమూల్యమైన, చిత్తబుద్ధిగల ధ్యానము కోట్లకొలదిగా గల యజ్ఞాలకంటెను మిక్కిలి శ్రేష్ఠతరము. కాబట్టి మానసికంగా భగవద్ధ్యానము తీరినప్పుడల్లా చేస్తుండాలి.

వజ్రాదపి కఠోరాణి – మృదూని కుసుమాదపి
లోకోత్తరాణాం చేతాంసి – కో హి విజ్ఞాతు మర్హతి ? 88

భా॥ లోకోత్తరులైన మహాత్ముల, మహనీయుల, ప్రసిద్ధవ్యక్తుల మనసులు ఒక్కోసారి వజ్రముకంటె కఠినాతి కఠినంగా ఉంటాయి. ఒక్కో పర్యాయము వారి మనసులు పుష్పములకంటె మృదువుగా ఉంటాయి. నవనీతమువలె సుతిమెత్తగా ఉంటాయి. "నిండుమనంబు నవ్యనవనీత సమానము. పల్కు దారుణాఖండల శస్త్రతుల్యము" అని సెలవిచ్చాడు నన్నయ్య. అలాంటి మహాత్ముల చిత్తాన్ని చిత్తగించడానికెవరికి సాధ్యపడుతుంది? హరిశ్చంద్రుడు పరకన్యా వివాహ తిరస్కార సమయంలో, భార్యామణిని శిరచ్ఛేదనం చేయడంలో కఠినంగాను, విశ్వామిత్రునికి సకల సామ్రాజ్య దానంలో మృదువుగాను వ్యవహరించాడు.

పరోపదేశే పాండిత్యం । – సర్వేషాం సుకరం నృణామ్
ధర్మే స్వీయ మనుష్ఠానం – కస్యచిత్తు మహాత్మనః ॥ 89

భా॥ లోకంలో ఇతరులకుపదేశించడం అనేది ప్రతివారికి చాలా సులువైన పని. కాని తాను ఉపదేశించిన ధర్మాన్ని, సూత్రాన్ని, నియమాన్ని, కట్టుబాటును తానాచరించి ఆదర్శంగా నిలబడేవారరుదు. అలా ధర్మాన్ని ఉపదేశించి, తదనుగుణంగా నడచుకోగలగడం లోకంలో ఒక్క మహాత్మునికి మాత్రమే సాధ్యము. అచరణీయము. అట్టి మహాత్ముల మాటకే సమాజంలో విలువ ఉంటుంది. వారి వాక్కు శిరోధార్యము కాగలదు. వారి బాటలో పదిమంది నడువగలరు.

చత్వారో ధన దాయాదాః – ధర్మాగ్ని నృప తస్కరాః
తేషాం జ్యేష్ఠావ మానేన – త్రయః కుప్యంతి సోదరాః ॥ 90

భా॥ లోకంలో బావమరదులు బ్రతుకగోరతారనీ, దాయాదులు చావగోరుతారని సామెత ప్రసిద్ధము. ధనానికి కూడ నలుగురు దాయాదులు వున్నారు. వారే ధర్మము, అగ్ని, రాజు, దొంగ, వీరు ధనాన్ని వ్యయపరచడం ద్వారానో, బుగ్గిపాలు చేయడం ద్వారానో, పన్నుల రూపేణ కాజేయడానికో, అపహరణ చేయడం ద్వారానో దాని అంతు చూడడానికి ప్రయత్నిస్తుంటారు. ఈ నలుగురిలో జ్యేష్ఠస్థానము ధర్మము. ఆ ధర్మానికి అవమానం కలిగిస్తే దాని సోదర తుల్యములైన మిగతా అగ్ని, రాజు, దొంగ లు కోపగించుతారు. తద్వారా ధర్మబద్ధముకాని ధనము అగ్గిపాలో, రాజుపాలో, దొంగలపాలో అవడం తథ్యం.

శోకారాతి భయత్రాణం । - ప్రీతి విస్రంభ భాజనం ।
కేన రత్నమిదం సృష్టం ? - 'మిత్ర' మిత్యక్షర ద్వయం ॥ 91

అరాతి - శత్రువు ; విస్రంభము-నమ్మకము, భాజనము-యోగ్యత

భా॥ దుస్సహమైన, దుర్భరమైన శోకము నుండి, ప్రాణాంతకుడైన శత్రువునుండి, గుండె చెదరగొట్టే భయోత్పాదముల నుండి కాపాడేవాడును; ప్రేమకు, విశ్వాసమునకు నిర్వచనము చెప్పి, తదాచరణలో ఆదర్శపాత్రుడై తోడు నీడలా వెన్నంటి యుండేవాడును ఐన "మిత్ర" అను రెండక్షరముల అమూల్యమైన, అనర్ఘమైన రత్నాన్ని భగవంతుడు ఎట్లు సృజించెనో గదా! చిన్మయసూరి లోకంలో మనకు ముువ్వురే హితులని చెప్పాడు. వారే మాతా-పితా-మిత్రుడు. ఈ ముువ్వురిలోను మనకే కష్టమొచ్చినా, సుఖమొచ్చినా ప్రాథమిక భాగస్వామి మిత్రుడే సుమా!

మన ఏవ జగత్సర్వం - మన ఏవ మహారిపుః
మన ఏవ హి సంసారో - మన ఏవ జగత్త్రయమ్ 92

భా॥ లోకంలో సర్వజగత్తు మనుగడకు అవసరమనిపించేది మనస్సే. అది లేనిదే లోకం అడుగుతీసి అడుగుపెట్టలేము. మనం ఇన్ని సుఖాలు అనుభవిస్తున్నా మంటే మానవ మేధయే కారణము. ఆ మనస్సే ఒక్కో పర్యాయం విపరీతమై వెర్రితలలు వేసి, లోక సంహారానికి, లోక వినాశనానికి కారకమౌతున్నది. అందుకే మనస్సే మహాశత్రువు. సకల సంసార సుఖదుఃఖాలకు మనస్సే కారణము. కావున జగత్తు నేలుతూ జగద్వినాశనానికి కారకమౌతూ, మనల్ని భవబంధాలలో ముంచితేల్చి మన సంతోషానికి, విచారానికి కారణము, కారకము మనస్సే-

సుఖస్యానంతరం దుఃఖం - దుఃఖస్యానంతరం సుఖం
చక్రవత్ పరివర్తన్తే - దుఃఖానిచ సుఖానిచ ॥ 93

భా॥ సుఖం తరువాత దుఃఖము; దుఃఖము తరువాత సుఖము వస్తుంటాయి. సుఖదుఃఖాలు కావడికుండలుగా భావిస్తుంటారు. కలిమిలేములు కావడి కుండలు అని గూడ ప్రసిద్ధి. ఈ రెంటినీ మనం ఆమోదించాల్సిందే. సుఖాలు, దుఃఖాలు ఒక చక్రమువలె (వానిలోని అరలు) పైకిని క్రిందికిని తిరుగుతుంటాయి. అలాగే సుఖదుఃఖాలు ఒక దాని తరువాత మరొకటి వస్తూ ఉంటాయి. ఏవీ కలకాలం కాపురం ఉండబోవు. కష్టాలు కలకాలం ఉండవు. సుఖాలు అంతే.

జిహ్వాగ్రే వర్తతే లక్ష్మీః - జిహ్వాగ్రే మిత్ర బాంధవాః
జిహ్వాగ్రే బంధనం ప్రాప్తిః - జిహ్వాగ్రే మరణం ధ్రువమ్। 94

భా॥ జిహ్వ అంటే నాలుక. మనిషి తన వచోలావణ్యం చేతనే వివిధ లావాదేవీలు నెరపడం ద్వారా సిరిసంపదలు గడిస్తాడు. మంచిగా, మన్ననగా మాట్లాడి స్నేహితుల్ని, బంధువుల్ని ఏర్పరచుకుంటాడు. రకరకాల బంధములకు మన మాటతీరే కారణమౌతుంది. మన కర్కశమైన మాటయే ఒక్కోసారి ప్రాణాంతకం అవుతుంది. కాలుజారినా తీసుకోవచ్చునేమో కాని, నోరు జారితే తీసుకోలేము గదా!

సతాం సాప్తపదీ మైత్రీ । - సత్సతాం త్రిపదీ మతా ।
సత్సతామపి యే సంతి । - తేషాం మైత్రీ పదే పదే ॥ 95

భా॥ మంచివారికి ఎవరితోనైనా ఏడడుగులు నడచినా, ఏడు మాటలు మాట్లాడినా, ఏడుసార్లు తలలూపుకొన్నా యిట్టే మైత్రీ బంధం ఏర్పడుతుంది. అంతకన్నా అతి మంచివారికి మూడడుగులలోనే, లేదా మూడు మాటల్లోనే స్నేహము వెల్లివిరుస్తుంది. అంతకంటె మంచివారికి అనగా సత్పురుష శ్రేష్ఠులకు, మహామహాత్ములకైతే పదే పదే - అడుగడుగునా, ప్రతిమాట మాటకీ స్నేహమేర్పడి దృఢమౌతుంది. దీనినే "సంబంధం సాప్తపదీనమ్" అనికూడా అంటారు. ఎలాంటి వారితోనైనా ఏడడుగులు/ఏడుమాటలతోనే పవిత్రబంధం ఏర్పడి తీరుతుంది.

ఋణాగ్ని ర్వ్యాధి శత్రుశ్చ - జ్ఞాతి శేషం చ పంచకం
పునః పునః ప్రవర్ధంతే - తస్మాచ్ఛేషం న కారయేత్ 96

భా॥ అప్పు, అగ్ని, రోగము, శత్రువు, దాయాదులు అనెడి యీ యైదింటిని నిశ్శేషంగా నిర్మూలించాలి. అప్పు కొద్దిగా మిగిల్చినా వడ్డీకి వడ్డీ పెరిగి తీర్చలేనిదౌతుంది. నిప్పు కొద్దిగానైనా అలక్ష్యం చేస్తే అది ఊరూ వాడా తగలపెట్టవచ్చు. రోగము పూర్తిగా నయం చేసుకోకుంటే ప్రబలమై ప్రాణాంతకమౌతుంది. శత్రువును ఉదాసీనంగా వదిలేస్తే వాడు పక్కలో బల్లెమై మన ప్రాణాలనే తీస్తాడు. దాయాదులు పగబూని మన స్థిరచరాస్తులపై కన్నువేసి మనలను మట్టికరిపిస్తారు. కాబట్టి పై అయిదింటి విషయంలో అప్రమత్తంగా ఉండాలి. వాటిని నిరోధించాలి - రూపుమాపాలి.

ప్రియ వాక్య ప్రదానేన - సర్వే తుష్యంతి జంతవః
తస్మాత్తదేవ వక్తవ్యం - వచనే కా దరిద్రతా ? 97

భా॥ హితాన్ని మితంగాను, ప్రేమను అమితంగాను ఆదరించి ప్రియాతి ప్రియముగా మాట్లాడటం వలన లోకంలో సకల ప్రాణికోటి సంతోషిస్తుంది. కాబట్టి ఆవిధంగా ప్రేమపూర్వకంగా మాట్లాడమే మనము చేయవలసిన పని. అలాగా కాక కొందరు పెదవి విప్పరు. పలకరింపరు, ఒకవేళ పలికినా ములుకుల్లా గ్రుచ్చుకొంటాయి. భగవంతుడు చక్కగా నోరు, ఆ నోటికి సరిపడా భాష, భావము అనుగ్రహించాడు గదా! మాటలకేం దరిద్రమో! "మధుర భాషణమున మర్యాద ప్రాప్తించు" నన్నారు పెద్దలు.

దుర్జనేన సమం వైరం - ప్రీతిం చాపి న కారయేత్
ఉష్ణో దహతి చాంగారః - శీతః కృష్ణాయతే కరమ్ ॥ 98

భా॥ దుర్జనుడు ఎల్లప్పుడూ దూరంగా త్యజించదగినవాడే. వానితో ఎప్పుడు వైరం పెట్టుకోవద్దు. అలాగని స్నేహాన్ని కూడ చేయవద్దు. దుర్జనులను బొగ్గులతో పోల్చవచ్చు. బొగ్గులు చల్లగా ఉన్నప్పుడు తాకితే చేతుల నిండుగా మసిచేస్తాయి. పోనీ వేడిగా ఉన్నప్పుడు తాకితే చేతులను కాలుస్తాయి. కాబట్టి లోకంలో దుర్జనులను గ్రేడింగ్ చేసి పసికట్టినప్పుడు వారితో (దుర్జనం ప్రథమం వందే) అన్నట్లుగా ఒక్క నమస్కార బాణం వదలి చల్లగా మెల్లగా తప్పుకోవాలి, విలువైన మణులు నెత్తిన ధరించిన పాముచెంతకు ఎలా పోజాలమో, విద్యా, ధన, రూప, యౌవన సంపన్ను డైనప్పటికిని దుర్జనుని చెంతకు పోరాదని భావము.

జీర్యంతే జీర్యతః కేశాః - దంతాః జీర్యంతి జీర్యతః
జీర్యత శ్చక్షుషీ శ్రోత్రే - తృష్ణైకా తరుణాయతే ॥ 99

భా॥ మునలితనం మీదపడేకొద్దీ జుట్టు, పళ్ళు, జీర్ణములై రాలి, ఊడిపోతున్నాయి. కళ్ళు కనబడడం లేదు. చెవులు వినబడడం లేదు. కాని అదేమి చిత్రమో! 'ఆశ' అనేది మాత్రము నిత్యనూతన యౌవనముతో అంతకంతకు గట్టిపడుచున్నది. దానికి రాలడం కాని, ఊడడం కాని, శిథిలమవ్వడం కాని లేదు గదా!

**బాలస్తావత్ క్రీడాసక్తః - తరుణస్తావత్ తరుణీసక్తః**
**వృద్ధస్తావత్ చింతాసక్తః - పరమే బ్రహ్మణి కో హిసక్తః 100**

భా॥ బాలలు కడుపునిండుగా తిని, అది అరిగేదాకా ఆటల్లో నిమగ్నమౌతారు. వారికే అడ్డంకులు ఉండవు. నిరంతర క్రీడా పరాయణా ప్రావీణ్యమే వారికి అందము. నూతన యౌవన జవనాశ్వ స్వారీ పరాయణులైన తరుణ గణము తరుణీ రూపలావణ్యగుణగణ పరిగణనలో ఆసక్తి కనబరుస్తారు. వృద్ధులు కోల్పోయిన జవసత్వాలు, వెన్ను విరిచివేస్తున్న గురుతర బాధ్యతలు, కలతకు, నలతకు కారకులౌతున్న ఆలుబిడ్డలు, అంతులేని ఆధివ్యాధులు వీనిని గూర్చి నిరతము చింతాసక్తులై ఉంటారు. బాలలు, తరుణులు, వృద్ధులు యిలా ఎవరిగోలలో వారు పడితే (పరమాత్మ) చింతన ఎవరికి కావాలి? దానియందు ఆసక్తి ఎవరు కనబరిచేవారు లేరు.

**వైద్యరాజ ! నమస్తుభ్యం - యమరాజ సహోదర !**
**యమస్తు హరతి ప్రాణాన్ - వైద్యో ప్రాణాన్ ధనాని చ॥ 101**

భా॥ యమధర్మరాజంటే అందరికి భయమే. ఆయన అనుంగు సోదరుడే వైద్యరాజు. లోకంలో వైద్యుడు ప్రాణం పోస్తాడని, యముడు ప్రాణం తీస్తాడని ప్రతీతి. కాని ఆ ధర్మం తిరగబడింది. యమరాజుకు సహోదరుడైన ఓవైద్యరాజా! నీకు నమస్కారము. (దయచేసి మా చెంతకు రావద్దు) యముడు ప్రాణములను మాత్రమే కాజేస్తాడు. వైద్యుడేమో అటు ప్రాణాలను, ఇటు ధనాన్ని కాజేస్తున్నాడు. డాక్టరు గారి కంటె యముడే కొంచెం నయమనిపిస్తున్నాడు.

**మాతా శత్రుః పితావైరీ - యేన బాలో న పాఠితః**
**న గర్భ చ్యుతి మాత్రేణ - పుత్రో భవతి పండితః 102**

భా॥ బిడ్డలు కలగగానే తల్లిదండ్రులు సంతోషిస్తారు. కాని అంతటితో బాధ్యత తీరిపోదు. వారిని పెంచి, పోషించి, చదువు, సంధ్యలలో చక్కని తర్ఫీదు నిచ్చి వాడికాళ్ళ మీద వాణ్ణి నిలబడేలా చేయడం బృహత్తర బాధ్యత. ఈ బాధ్యత విస్మరించిన తల్లి,తండ్రియు వారి బిడ్డలకు శత్రువులే. లోకంలో ఎవ్వడూ తల్లిగర్భమునుండి ఊడిపడగానే పండితుడు కాలేదు. క్రమశిక్షణతో కూడిన సాధనవల్లనే మాననీయుడు కాగలడు.

కుగ్రామవాసో కుజనస్య సేవా
కుభోజనః క్రోధముఖీ చ భార్యా
మూర్ఖశ్చ పుత్రో విధవా చ కన్యా
వినాగ్నినా సందహతే శరీరమ్ 103

భా॥ అప్పిచ్చువాడు, వైద్యుడు, ఏఱు, ద్విజుడు, లేని మిక్కిలి చిన్న పల్లెయందు నివాసము; దుర్జనుని సేవించుట; ఎవరికి పనికి రాని తిండి తినుట; నిప్పులు కురిపించే ముక్కోపియైన భార్యామణి; చూసి రమ్మంటే కాల్చి ముప్పతిప్పలు పెట్టే పుత్రరత్నము; చిన్న వయస్సునందే విధి వక్రించి విధవగా మారిన కూతురు అనునవి నిప్పులేకనే నిరతము, నిరంతరము, శరీరాన్ని దహించివేస్తాయి. ఈ బాధలకు ముక్తిలేదు.

క్షణం చిత్తం క్షణం విత్తం – క్షణం జీవిత మావయోః
యమస్య కరుణా నాస్తి – ధర్మస్య త్వరితా గతిః 104

భా॥ మన చిత్తప్రవృత్తి, క్షణం క్షణం మారిపోతూ ఉంటుంధి. పుణ్యం చేయాలని కాసేపు, పాపం చేయాలని కాసేపు ఆరాటపడుతుంది. ఇక డబ్బు చంచలము, మన వద్ద స్థిరంగా ఉండదు. మన జీవితము క్షణ భంగురము. నీటి బుడగ వంటిది. చూస్తుండగానే అంతమౌతుంది. విధి నిర్వహణ పరాయణుడైన యమునికి కరుణయే లేదు. కావున ధర్మకార్యాలను సత్వరమే చేయాలి.

వినా యంత్రేణ మంత్రేణ – తంత్రేణ వినయేన చ
వంచయంతి నరం నార్యః – ప్రజ్ఞాధనమపి క్షణాత్ ॥ 105

భా॥ స్త్రీలు తలచుకొంటే ఎంతటి ప్రజ్ఞావంతుడు, ధీమంతుడు, శ్రీమంతుడు, ధన, రూప, విద్యా, సంపన్నుడైన పురుషుణ్ణైనా క్షణంలో కన్నుగప్పి మోసగింపగలరు. అందుకు గాను వారికే విధమైన విలాస వస్తువులు అవసరం లేదు. ముగ్ధులను చేయగల మంత్రాలుగాని, చిట్కాలు గాని అవసరం లేదు. అతి వినయము అంతకంటె అవసరం లేదు. కేవలము దర్శన, స్పర్శన, భాషణములు మాత్రమే వారి ఆయుధాలు. అందుకనే సినీ కవులు "ఆడదాని ఓరచూపులో జగాన ఓడిపోని ధీరుడెవ్వడూ" అని అనుభవపూర్వకంగా సెలవిచ్చారు.

న దానేన న మానేన - నార్జవేన న సేవయా
న శస్త్రేణ న శాస్త్రేణ - సర్వథా విషమా (ః) స్త్రియః ॥ 106

భా॥ స్త్రీల చిత్తప్రవృత్తులు చాల చిత్రంగాను, క్లిష్టంగాను అనూహ్యంగాను, అపూర్వంగాను, అద్భుతంగాను ఉంటాయి. అందుచేత వారిని దాన ధర్మాలచేతగాని, ప్రేమాదరణలచేతగాని, చక్కని ఋజుప్రవర్తన చేతగాని, సేవాపరాయణత చేతగాని, బలప్రయోగముచేతగాని, ధర్మ ప్రబోధాల వలనగాని లొంగతీసికోవడం, వశపరచుకోవడం దుస్సాధ్యం. వారి అగ్రహానుగ్రహాలు అనిర్వచనీయములు. వారి నిర్ణయానిర్ణయాలు అగణనీయములు. స్త్రీలు సర్వదా సర్వత్రా సంక్లిష్ట మనస్కులు. వారి మనస్సును తెలుసుకోవడం సృష్టికర్త బ్రహ్మకు కూడా తరము కాదు.

వనే రణే శత్రు జలాగ్ని మధ్యే - మహార్ణవే పర్వతమస్తకే వా
సుప్తం ప్రమత్తం విషమస్థితం వా- రక్షంతి పుణ్యాని పురాకృతాని107

భా॥ మనం ఎన్నో జన్మలు దాటి, మానవజన్మ ఎత్తుతుంటాము. ప్రతి జన్మలోను పాపమో, పుణ్యమో చేసియుంటాము. పురాకృత పుణ్యం ఉంటే మనం ఎలాంటి స్థితిలో ఉన్నను సురక్షితంగా బయటపడతాము. అడవిలోను, యుద్ధములోను, శత్రువ్యూహంలోను, కార్చిచ్చు మధ్య, సముద్రజలాల మధ్య, పర్వత శిఖరాగ్రాన ఉండనీ కాక, లేక నిద్రపోతున్నా, అజాగ్రత్తగా ఉన్నా, విషమావస్థలో ఉన్నా ఎలా ఉన్నా పురాకృత పుణ్యం ఉంటే ఏ మాత్రం ప్రమాదం లేకుండా తృటిలో తప్పించుకొని బయటపడగల్గుతాము. నేటి వార్తా పత్రికలలో యీ విధమైన వార్తలు కోకొల్లలు. ముందుజన్మలలో చేసిన పుణ్యాన్నే "పురాకృత పుణ్యం" అంటారు.

మాతా మిత్రం పితా చేతి - స్వభావా త్రితయం హితం
కార్యకారణత శ్చాన్యే - భవంతి హితబుద్ధయః ॥ 108

భా॥ లోకంలో ప్రతి ఒక్కరికి ముగ్గురే హితులు. వారు తల్లి తండ్రి, మిత్రుడు. మిగిలినవారు సమయాన్ని బట్టి, సందర్భాన్ని బట్టి, అవసరాన్ని బట్టి మాత్రమే హితులగుచున్నారు. నవమాసములు మోసి, కని, పెంచిన తల్లి కంటె మించిన హితులు మరొకరుండరు. అలాగే ఆలనా పాలనా, విద్యాబుద్ధులు, వ్యక్తిత్వము ప్రసాదించిన తండ్రియు మిక్కిలి హితుడే. తల్లిదండ్రులన్న దైవసన్నిభులురా' అని ఆర్యోక్తి. మిత్రుడు కూడ ప్రాణమున కంటె మిన్నగా ఉంటాడు. ఇక మిగిలినవారు ప్రయాణాల లోను, శుభకార్యాలలోను, కష్టకాలంలోను, ఆహార వ్యవహారాలలోను ఇలా సందర్భాన్ని బట్టి స్నేహితులై అలా కనుమరుగవుతుంటారు.

గురుశుశ్రూషయా విద్యా - పుష్కలేన ధనేన వా
అథవా విద్యయా విద్యా - చతుర్థా నోపలభ్యతే । 109

భా॥ గురువు యందు నిక్షిప్తమైన విద్యను పూర్వ కాలమందు గురువుగారికి సేవ చేయుట ద్వారా ఆర్జన చేసేవారు. మనం సాధించదలచుకొన్న విద్యను అలా గురుశుశ్రూషచేసిగాని, పుష్కలమైన ధనసంపత్తిచేతగాని, ఒక రకమైన విద్యను వారికి నేర్పి, మనం కావాలనుకొన్న విద్యనుప్రతిగా నేర్చుకోవడం ద్వారా గాని పొందాలి. అలా కాక విద్యను పొందగలగడానికి నాలుగోరకమైన ఉపాయం లోకంలో కనబడడం లేదు.

అంగం గళితం । ఫలితం ముండం।
దశన విహీనం । జాతం తుండం ।
వృద్ధో యాతి గృహీత్వా దండం ।
తదపి న ముంచ త్యాశాపాశం ॥ 110

భా॥ ముసలితనము మీద పడగానే అవయవాలన్నీ శిథిలములై పట్టుకోల్పోయి జారిపోతాయి. తల పెరుగు బుట్ట (ముగ్గు) అవుతుంది. పళ్ళు ఊడిపోతాయి. కఱ్ఱనూతగాగొని తడబడుచు నడువవలసివచ్చుచున్నది. అయినప్పటికిని మనిషిని "ఆశా పాశము" మాత్రము వదిలిపెట్టుట లేదు, అందుకే "తృష్ణైకా తరుణాయతే" అని కూడా చెప్పబడినది. మన దేహంలో ప్రతి భాగానికి ముదిమివలన శిథిలమవడం ఉన్నది. కాని అది మాత్రము నిత్యనూతనయౌవనముచే మిసమిసలాడుతూ మనలనెంతో బాధలకు గురిచేయుచున్నది.

స్వగృహే పూజ్యతే మూర్ఖః - స్వగ్రామే పూజ్యతే ప్రభుః
స్వదేశే పూజ్యతే రాజా - విద్వాన్ సర్వత్ర పూజ్యతే ॥ 111

భా॥ ఎంత మూర్ఖుడైనప్పటికిని కుటుంబ యజమాని యిష్టంగానో, అయిష్టంగానో తన కుటుంబంలో నిరంతరం పూజింపబడును. గ్రామాధికారి వివిధ పథకాలను అమలుచేస్తూ, శాసనానుగుణంగా పాలిస్తూ ఆ గ్రామంలో గౌరవింపబడతాడు. రామరాజ్యంగా మురిపించినా, రావణరాజ్యంగా ఝళిపించినా విధిగా రాజు తన దేశ ప్రజలచేత పూజలందుకొంటాడు. ఇంక విద్యాంసుడు (పండితుడు) అందరికి శ్రేయోభిలాషియై, విజ్ఞాన ప్రదాతయై సర్వే సర్వత్ర స్వదేశము, విదేశము అనుతేడా లేక సర్వదా సర్వథా ఆదరాభిమానాలు చూరగొంటాడు. రాచరికము కన్నను పాండిత్యము మిన్నయని భావము.

నాస్తీతి వచనం కష్టం - దేహీతి వచనం తథా
నాస్తి దేహీతి వచనం - మాభూత్ జన్మజన్మని 112

భా॥ 'నాస్తి' అనగా లేదు- అని అర్థము. 'దేహి' అనగా 'ఇమ్ము' అని అర్థము. ఎవరైనా ఏదైనా అడిగినప్పుడు 'లేదు' అనే జవాబుచెప్పడము కష్టం. మనకేవైనా యిబ్బందులు కల్గినప్పుడు ప్రాణ మిత్రులకైనా 'ఇవ్వండి' అని అడగడం కూడా కష్టమే. నాస్తి, దేహి అనే యీ రెండు మాటలు అభిమాన ధనులు వాడడానికిష్టపడరు. ఆ రెండు మాటలు జన్మ జన్మలలో కూడ మా చెంతకు రానివ్వకూడదని భగవంతుని ప్రార్థించాలి. నాస్తి, దేహి అనని, కనని, వినని జన్మయే సార్థకము.

అర్థాగమో నిత్య మరోగితా చ।
ప్రియా చ భార్యా ప్రియవాదినీ చ ।
వశ్యశ్చ పుత్రో ర్థకరీచ విద్యా ।
షడ్జీవ లోకేషు సుఖాని రాజన్ ॥ 113

భా॥ మంచి సంపాదన, పరిపూర్ణమైన ఆరోగ్యము - ప్రియురాలును, సరస సంభాషణా నైపుణ్య ప్రవీణురాలయిన (ప్రియురాలైన భార్య/ పైగా ఆమె ప్రియవాదిత్వము) అర్థాంగియు, ఆజ్ఞానుసారియైన పుత్రరత్నము; నిరతము ధనమును గడించిపెట్టగల దిట్టతనము గల విద్య - ఈ ఆరున్నా లోకములో మానవలోకానికి అత్యంత సుఖప్రదములు, శుభ ప్రదములు కాగలవు.

శతం విహాయ భోక్తవ్యం - సహస్రం స్నాన మాచరేత్
లక్షం విహాయ దాతవ్యం - కోటిం త్యక్త్వా హరిం భజేత్॥ 114

భా॥ తనకోసం ఎదురుచూస్తున్న నూరుమందినిగానీ, నూరు పనులను గానీ విడిచిపెట్టినా, సకాలంలో భోజనాలు చేయవలెను. వేయిపనులు మీద పడి తొందరపెడుతున్నా, పరిశుభ్రముగా స్నానము చేయవలెను. లక్ష పనులలో నిమగ్నమైనా 'దేహి' అని ఎవరైనా అడిగినప్పుడు లేదనక, కాదనక తప్పక దానము చేయవలెను. కోటిమందిలో కూర్చొనియున్నా, కోటి పనులలో మునిగితేలుతున్నా 'భగవన్నామ స్మరణము' చేయ వలయును. బోనము (భోజనము), స్నానము, దానము, ధ్యానము సకాలంలో సక్రమంగా భక్తిశ్రద్ధలతో చేయాలని సారాంశము.

న దేవో విద్యతే కాష్ఠే - న పాషాణే న మృణ్మయే
భావే తు విద్యతే దేవః - తస్మా ద్భావో హి కారణమ్ ॥ 115

భా॥ మనం దేవుడి విగ్రహం కనబడగానే నమస్కారం చేస్తాము. కాని ఆ దేవుడు కొయ్యబొమ్మలోగాని, రాతిబొమ్మలోగాని, మట్టిబొమ్మలోగాని లేడు. కాని వాటిలో దేవుడున్నాడనే భావన మనకున్నది. కావుననే నమస్కరించుచున్నాము. దేవుడు మన భావంలోనే ఉన్నాడు. కాబట్టి దేవుడున్నాడని వాదించినా, లేడని వాదించినా కారణం పైన పేర్కొన్న బొమ్మలు కావు. భావమే కారణము. దేవునికి కావలసింది బాహ్యపూజ కాదు. భావ పూజ కావాలి. అందుచేతనే "చిత్తశుద్ధిలేక శివపూజలేలరా! అన్నారు.

శతనిష్కో ధనాఢ్యశ్చ - శత గ్రామేణ భూపతిః
శతాశ్వః క్షత్రియో రాజా ! - శత శ్లోకేన పండితః ॥ 116

భా॥ 108 మాడలు ఒక నిష్కము. అటువంటి నూఱు నిష్కములు గలవాడే మిక్కిలి ధనవంతుడు. నూఱు గ్రామాలకు ఆధిపత్యము వహించగలవాడే అధికారి. నూఱు ఆశ్విక బల ప్రతిపత్తి కలిగిన క్షత్రియుడే రాజు. కనీసము నూఱు శ్లోకములు క్షుణ్ణముగా కూలంకషంగా సాధన చేసిన వాడే పండిత ముద్రాంకితుడు కాగలడు.

-: సర్వేజనాః సుఖినో భవన్తు :-



# సాహితీ మిత్రులు, కైకలూరు

## ప్రచురణలు

1. **కొల్లేటి తీరాన...** కవితా సంకలనం : వసుధ
2. **సామాజిక హైకూలు** – డా. రావి రంగారావు
3. **తెలుగు సాహిత్య శతాబ్దం** – నవులూరి రమేష్ బాబు
4. **కైకలూరు సాహితీ మిత్రుల పంచమ వార్షికోత్సవ సంచిక** – సంపాదకత్వం : వసుధ, చింతపల్లి వెంకట నారాయణ
5. **రంగరాజు పలుకు – రసములొలుకు** – కంతేటి భోజరంగరాజు
6. **చూరు** కవితా సంపుటి –వసుధ
7. **చుక్కపొద్దు** కవితా సంపుటి – మాల్యాద్రి
8. **వలసపిట్ట** దీర్ఘకవిత : – మాల్యాద్రి
9. **సునామి** కవితా సంకలనం సంపాదకులు : డాక్టర్ రావి రంగారావు
10. **ఆధునికతలు** వచన కవితలు : – వసుధ
11. **ఆకాశమంత అమ్మ** కవితా సంపుటి :–గాధిరాజు రంగరాజు
12. **మనమంతా ఒక్కటే** కవితా సంపుటి : –గరికిముక్కుల విజయ ప్రసాద్
13. **లలితా అష్టోత్తర శతం** –తెలుగుసేత: డా॥ రాళ్ళబండి కవితా ప్రసాద్
14. **దేశమును ప్రేమించుమన్నా** సంకలనం : పోపూరి శ్యామసుందర్
15. **విశేష ప్రజ్ఞావధానం** రూపశిల్పి : శ్రీమత్ తిరుమల పురఘళ్ళ శ్రీరామచంద్రశ్రీనివాస్
16. **లయ** (రేడియో సమీక్షలు) – తాతా రమేష్ బాబు
17. **మందార మకరందాలు** సంకలనం : పీసపాటి కోటేశ్వరరావు



# పీసపాటి కోటేశ్వరరావు

స్కూల్ అసిస్టెంట్ (తెలుగు)

శ్రీ నిమ్మగడ్డ నాగభూషణం ప్రభుత్వ ఉన్నత పాఠశాల

**కైకలూరు, కృష్ణాజిల్లా, పిన్ : 521 333.**

జననం : 01 జూన్ 1953
**(88 తాళ్ళూరు - క్రోసూరు మండలం, గుంటూరు జిల్లా)**

తల్లిదండ్రులు : శ్రీమతి శేషమ్మ, శ్రీ వెంకట్రావు

భార్య : శ్రీమతి రంగనాయకమ్మ

సంతానము : సాయికృష్ణ రవికిషోర్, B.Sc., B.Ed.
హరికృష్ణ, B.Tech.,
మాధురి, B.Com.,

గురువులు (వృత్తిపరము) : శ్రీ చింతా బాలకృష్ణ శర్మ గారు
విశ్రాంత ఆంధ్ర ఉపాధ్యాయులు, మంగళగిరి, గుంటూరుజిల్లా

(ప్రవృత్తి పరము) : శ్రీ కొప్పరపు బాలామనోహరరావుగారు
విశ్రాంత డెప్యూటీ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్, హైదరాబాద్

విద్యార్హతలు : భాషా ప్రవీణ, పండిట్స్ ట్రైనింగ్
M.A. (తెలుగు), P.O.L. (సంస్కృతం)

వృత్తి : స్కూల్ అసిస్టెంట్ (తెలుగు)

అభిరుచులు : పుస్తక పఠనం, ఆధ్యాత్మిక కార్యక్రమాల్లో పాల్గొనడం, ఓపెన్ స్కూల్ విధానంపై విస్తృత ప్రచారం

సన్మానాలు : 1) 1981లో జనాభాగణనలో విజయవాడ తాలూకా స్థాయిలో రాష్ట్రపతి ప్రశంసా పత్రము, రజిత పతక బహూకరణ

: 3) 1990 లయన్స్ క్లబ్, కంకిపాడు వారిచే ది. 05-09-1990న ఉత్తమ ఉపాధ్యాయ సత్కారం

: 2) 1991లో జనాభా గణనలో డైరక్టర్ ఆఫ్ సెన్సస్ ఆపరేషన్ వారిచే ప్రశంసా పత్రము

: 4) 1999లో కృష్ణాజిల్లా స్థాయిలో ఉత్తమ ఉపాధ్యాయ సన్మాన పురస్కారము (ది. 05-09-1999)